# క్రొత్త హార్లిక్స్ బిస్కట్లు

శక్తి నిచ్చేవి




పోషకవంతమైనవి

కుటుంబములోని వారందరికీ ఉత్తమమైనవి—
ప్రతీ బిస్కట్‌లోను హార్లిక్స్ యొక్క శక్తి నిచ్చే
పోషకత్వము వుంది.

బ్రిటానియా

బ్రిటానియా అంటే నాణ్యతకు గుర్తు

EBC 7713




అతడి జీవనోపాధికి మంచి చదువు చెప్పించి అతడి భావి శ్రేయస్సుకు బాట వేయవలసిన సమయం త్వరలో మీకు వస్తుంది. మంచి చదువంటే ఈ రోజుల్లో మాటలా? వ్యయంతో కూడిన పనే!

కాబట్టి అగర్భ శ్రీమంతులైతే తప్ప, ఎవరు గాని

## రేపు సుఖపడేందుకు నేడే ఆదా చెయ్యాలి.

ఇందుకు మేలైనవి మా డిపాజిట్లు:

| | |
|---|---|
| ఫిక్సెడ్ డిపాజిట్లు: | వడ్డీ సాలుకు 6-5/8% వరకు |
| లేక సేవింగ్స్ డిపాజిట్లు: | వడ్డీ సాలుసరి 3-1/2% |
| లేక రికరింగ్ డిపాజిట్లు: | ఉద్యోగస్తులకు ఉత్తమమైనవి |

# ది ఆంధ్రా బ్యాంక్ లిమిటెడ్

(స్నేహపూర్వకమైన సేవ నిచ్చే సంస్థ)

(రిజిస్టర్డ్ ఆఫీసు: మచిలీపట్నం :: సెంట్రల్ ఆఫీసు: హైదరాబాద్)

కె. గోపాల్‌రావు
చైర్మన్.

మొత్తము బ్రాంచిలు 118.

చిన్న పిల్లలందరనూ
రంజింపచేసే కథ

జైతీ సమర్పించు

బస్తీలో భూతం

ఈస్ట్‌మన్ కలర్

దర్శకత్వం
M.V. రామన్





## నియమ విధులను పాటిస్తూ ఆడడం నేర్పుతున్నారా?
## ఫోర్‌హాన్స్‌తో దంతసంరక్షణను కూడా అతనికి నేర్పండి

మీ బిడ్డ జీవితంలో ప్రతిదీ సక్రమంగా, నియమబద్ధంగా చేసి, తను చేసే ప్రతి విషయంలో తన స్నేహితులను మించి పోవాలనుకునే సమయమొస్తుంది. అదే సరియైన దంత సంరక్షణ—ఫోర్‌హాన్స్‌తో—నేర్పుటకు మంచి తరుణం ☐ ఫోర్‌హాన్స్ ఇగుళ్ళ జబ్బులను దంత క్షీణతను నివారించు టూత్ పేస్టు. ఒక దంత వైద్యుని చేత నిర్మించబడ్డ యీ టూత్ పేస్టులో బిగువైన పళ్ళకు ఇగుళ్ళకు కావలసిన ప్రత్యేకమైన మందులున్నాయి. అది మీకు మంచిది—మీ బిడ్డకు కూడా మంచిది. అందుకని నియమం తప్పకుండా తన పళ్ళను ఫోర్‌హాన్స్‌తో—ఉదయం, రాత్రి తోముకోవడం నేర్పండి. జీవితాంతం అవసరమైన దంత సంరక్షణ ఇప్పుడే నేర్పండి.

**జాగు చేయ్యక ఫోర్‌హాన్స్‌తో దంతసంరక్షణ ఇప్పుడే నేర్పండి**




ఉచితం: "పళ్ళు, ఇగుళ్ళను గురించి తీసుకోవలసిన శ్రద్ధ"* అనే రంగుల చిత్రాలలోనున్న ఈ చిన్న పుస్తకం అనేక విషయాలను తెలుపుతుంది. పది భాషల్లో దొరుకుతుంది. (తపాలా ఖర్చుకు) 15 పై. బిళ్ళలు పంపండి.

అడ్రసు: మానర్స్ డెంటల్ అడ్వైజరీ బ్యూరో, పోస్టు బ్యాగు నం. 10031, బొంబాయి-1.

పేరు ______________________

అడ్రసు ______________________

† మీకు కావలసిన భాష క్రింద గీత పెట్టండి: తెలుగు, ఇంగ్లీషు, హిందీ, మరాఠీ, గుజరాతీ, ఉర్దూ, బెంగాలీ, అరవం, మలయాళం, కన్నడ.

• ఈ పుస్తకం అతడు చదివే పుస్తకాలలోకెల్ల ముఖ్యమైనది కావచ్చు

## ఫోర్‌హాన్స్
## టూత్ పేస్టు — ఒక దంతవైద్యుడు నిర్మించినది

32F-182 TEL

"C.1"



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ సంచికలో బేతాళకథ [పితృహత్య] రాసినవారు వారణాసి సూర్యనారాయణ. ప్రజలకు మేలు చేసే విశ్వాసాలను చెడగొట్టినట్టయితే తీరని నష్టం కలుగుతుంది. ఈ సూత్రం పై ఈ కథ ఆధారపడింది.

ఆశలు కష్టాలు తెచ్చిపెడతాయని వాటికి దూరంగా ఉండిపోవటం సాధ్యం కాదు. జీవితం కోరికల పుట్ట. ఆ కోరికలను సాధించటమే నిజమైన్న పురుషార్థం. ఈ నీతి మనకు "వదలని ఆశలు" అన్న కథలో కనబడుతుంది.

సంపుటి 43 సెప్టెంబర్ '68 సంచిక 3



# భారత చరిత్ర



1823 జనవరి 1 న లార్డ్ హేస్టింగ్స్ గవర్నరుజనరలు పని చాలించుకుని వెళ్ళిపోయేనాటికి, సట్లెజ్ నుంచి బ్రహ్మపుత్ర వరకూ, హిమాలయాల నుంచి కన్యాకుమారి వరకూ గల భారతదేశం నిర్వివాదంగా బ్రిటిషువారి అధీనమయింది. కాని ఈ సామ్రాజ్యంలో స్థిరపరిపాలన సాగాలంటే బ్రిటిషువారు తూర్పు, పడమర సరిహద్దులపై ఇతరులు కలిగించే అరాజక చర్యలను అణచటం తప్పనిసరి అయింది.

ఇంగ్లీషువారికి బర్మాతో 17 వ శతాబ్ది నుంచీ వర్తక సంబంధాలు ఉంటూ వచ్చాయి. అయితే, అస్పష్టంగా ఉన్న తూర్పు సరిహద్దు మీద బర్మావాళ్ళు చాలా అశాంతి రేకెత్తిస్తూ వచ్చారు. బర్మాతో వైరం తెచ్చుకోవటం ఇష్టంలేక బ్రిటిషు వాళ్ళు 1795 - 1811 మధ్యకాలంలో అరుసార్లు రాయబారాలు పంపారు.

1821 - 22 లో బర్మావారు అసామును జయించారు; 1823 సెప్టెంబరులో వారు, చిటగాంగు సమీపంలో షాపురీ అనే దీవిని పట్టుకుని, దాన్ని అక్రమించి ఉన్న బ్రిటిషు సైనికులను పారదోలారు. అటుతరవాత వారు బెంగాలులో కంపెనీ అధీనంలో ఉన్న ప్రాంతాలపై దాడిచెయ్యటానికి ప్రయత్నాలు సాగించారు.

అలాంటి స్థితిలో కొత్త గవర్నరుజనరలు 1824 ఫిబ్రవరి 24 న బర్మాపై యుద్ధం ప్రకటించాడు. బ్రిటిషు సైన్యాలు బర్మా వారిని అసాము నుంచి పారదోలగలిగాయి గాని, చిటగాంగు సరిహద్దు వద్ద, రాము అనే ప్రాంతంలో, బందులా అనే ప్రఖ్యాత బర్మాసేనా నాయకుడి బలాల చేత తిప్పి కొట్టబడ్డాయి.

అయితే ఈ లోపల బ్రిటిషువారు సముద్ర మార్గాన రంగూను పై దాడి తల

**84. బర్మా యుద్ధాలు**



పెట్టారు. ఇందుకుగాను 11,000 మంది సైనికులను సమీకరించారు; వారిలో హెచ్చుమంది మద్రాసురాష్ట్రంవారే. వారికి నాయకుడు జనరల్ కాంప్‌బెల్. బ్రిటిషు నౌకలకు అధిపతి కాప్టెన్ మర్యాట్ అనే ప్రసిద్ధ నవలాకారుడు.

1824 మే 11 న రంగూను బ్రిటిషు సేనలకు లొంగిపోయింది. బర్మావాళ్ళు బ్రిటిషు సేనలను ప్రతిఘటించక, తమ సర్వస్వాన్నీ తీసుకుని పెగూ అరణ్య ప్రాంతాలకు పారిపోయారు. బ్రిటిషు సైనికులకు తిండి కూడా లేదు; వానాకాలం కావటం చేత వాతావరణం చాలా అనారోగ్యకరంగా ఉన్నది. బ్రిటిషువాళ్ళు నానా అగచాట్లూ పడ్డారు.

డిసెంబరు 1 నాటికి బందులా, 60 వేలమంది సైనికులతో రంగూను సమీపానికి వచ్చి చేరాడు. అయితే ఆ నెల 15 న అతను బ్రిటిషువారి చేతిలో ఓడిపోయి, దోనాబ్యూ అనే ప్రదేశానికి తిరోగమించాడు. అక్కడే వుండి 1825 ఏప్రిలు ఆరంభం దాకా పోరాటం సాగిస్తూ, యాదృచ్ఛికంగా తగిలిన గుండుదెబ్బతో మరణించాడు. అతని మరణంతో బర్మాకు తీరని నష్టం కలిగింది.



బ్రిటిషు సేనాపతి అయిన కాంప్‌బెల్, ఏప్రిల్ 25 న, దిగువబర్మా రాజధాని అయిన ప్రోమ్‌నగరాన్ని ఆక్రమించి, వానాకాలం వెళ్ళిన దాకా అక్కడే ఉన్నాడు. 1826 ఫిబ్రవరి 24 న బర్మాకూ, బ్రిటిషు వారికి సంధి కుదిరింది. బ్రిటిషువారికి యుద్ధనష్టం కింద బర్మావారు కోటిరూపాయలు ఇచ్చుకున్నారు; అసామ్, కాచార్, జయంతియా ప్రాంతాలపై జోక్యం కలిగించుకోమని మాట ఇచ్చారు; బర్మాలో బ్రిటిషురెసిడెంటును ఏర్పాటు చేశారు. ఈ యుద్ధం వల్ల బర్మా సముద్ర తీరంపై బ్రిటిషువారికి చాలా అధికారాలు వచ్చాయి.



మొదటి బర్మాయుద్ధంతో గాని, దాని అనంతరం జరిగిన సంధితో గాని బ్రిటిషు వారి చిక్కులు విడలేదు. 1837 మేలో పాత బర్మారాజును తొలగించి, అతని తమ్ముణ్ణి రాజుగా ప్రకటించారు. తన అన్న చేసుకున్న సంధి షరతులకు తాను బద్ధుణ్ణి కానని కొత్తరాజు తెలియజేశాడు. అతను బ్రిటిషు రెసిడెంట్లను అవమాన పరిచాడు. 1840 లో రెసిడెన్సీని మూయ వలసివచ్చింది. రంగూనులో ఉండే బర్మా రాజప్రతినిధి (గవర్నరు) బ్రిటిషు వర్తకులను చాలా తిప్పలు పెట్టాడు. వాళ్ళు కలకత్తా ప్రభుత్వంతో మొరబెట్టుకున్నారు.

గవర్నరుజనరలు డల్‌హౌసీ బర్మాకు ఒక యుద్ధనౌకను పంపి, బర్మారాజును నిర్బంధంలో ఉంచి, బ్రిటిషు వర్తకులకు నష్టపరిహారం ఇవ్వాలనీ, రంగూను గవర్నరును బదిలీ చెయ్యాలనీ అడిగాడు. బర్మా రాజు యుద్ధం కోరలేదు. అయితే బ్రిటిషు యుద్ధనౌకాధిపతి లాంబర్ట్ తొందరపాటువల్ల బర్మావారు ఆ యుద్ధనౌక పై కాల్పులు చేయటం జరిగింది. 1852 ఏప్రిలు 1 లోపుగా బర్మారాజు బ్రిటిషువారికి లక్ష సవర్లు పరిహారం ఇవ్వాలని బ్రిటిషువారు ఆదేశించారు. దీనికి బర్మావారు సమాధానం ఇవ్వలేదు.

తాము పెట్టిన గడువు అయిపోయిన నాడే బ్రిటిషు సైనిక, నావికాబలాలు రంగూను చేరాయి. త్వరలోనే మర్తబాన్ పతనమయింది. ఏప్రిలు 14 న బ్రిటిషు సైనికులు, జగత్ప్రసిద్ధమైన రంగూన్ పగోడాలోకి జొరబడ్డారు. మరొక మాసానికి బసీన్ ఆక్రమించబడింది. అక్టోబరు, నవంబరులలో ప్రోమ్‌నగరమూ, పెగూ ఓడిపోయాయి. పెగూ బ్రిటిషువశం కావటంతో బ్రిటిషు భారతసామ్రాజ్యపు తూర్పు సరిహద్దు బంగాళాఖాతపు తూర్పుతీరాన్ని ఆక్రమించేసింది.





# కోయిల వైద్యం

తాతయ్య ఇంటికి చేరుకునేసరికి పిల్లలు ఏదో బొమ్మల పుస్తకం మీద మూగి ఉన్నారు. "ఏమిట్రా ఆ పుస్తకం?" అని తాతయ్య అడిగాడు.

"పక్షుల బొమ్మల పుస్తకం, తాతయ్యా. బొమ్మల కింద పక్షులను గురించి రాసి ఉంది," అన్నారు పిల్లలు.

"అదా సంగతి?" అంటూ తాతయ్య పడక కుర్చీలో చేరగిలబడి పొడుంకాయ పైకి తీశాడు. పిల్లలు బొమ్మల పుస్తకం వదిలేసి, తాతయ్య చుట్టూ మూగి, తలా ఒక ప్రశ్న వేశారు:

"గుడ్లగూబ పగటిపూట గూట్లో నుంచి బయటికి రాదా తాతయ్యా?....కోయిల కాకి గూట్లో గుడ్లు పెట్టి పొదిగిస్తుందా, తాతయ్యా?"

"మరే, మధ్యాన్నమే, మన వేపచెట్టు మీద కోయిలకూసింది," అన్నాడు బుల్లాడు.

"తన గూట్లో పెరిగిన కోయిలపిల్ల కూసిన దాకా కాకి తన పిల్లే అనుకుంటుంది. అది కూయగానే గూట్లో నుంచి తరిమేస్తుంది. కాదు, తాతయ్యా?" అన్నాడు పెద్దవాడు.

"దానికంతా ఓ కథ ఉందర్రా," అన్నాడు తాతయ్య.

కథ అనగానే పిల్లలు, "కథ చెప్పు, తాతయ్యా," అంటూ మరింత దగ్గిరికి జరిగి కూచున్నారు. తాతయ్య చిటికెడు పొడుం పీల్చి, కథ చెప్ప నారంభించాడు:

ఒక దేశంలో ఒక అరణ్యం ఉండేది. అందులో ఒక భాగం పక్షుల రాజ్యం. ఒక రోజున ఒక కొంటె కుర్రాడు ఉండేలు బద్దతో చెట్టుమీది పిట్టలను కొట్టటానికి ఈ పక్షుల రాజ్యంలోకి వచ్చాడు.

అప్పు డేమయిందంటే, వాడు విడిచిన మట్టి ఉండ ఒకటి ఒక గుడ్లగూబ డొక్కలో



గుచ్చుకున్నది. గుడ్లగూబకు జరిగినది ఏమిటో తెలియలేదు. ఉన్నట్టుండి, అకస్మాత్తుగా దానికి, పాపం, డొక్కలో పోటు ఆరంభమయింది. ఆ బాధతో అది చిన్నగా మూలగసాగింది.

గుడ్లగూబ కూర్చుని ఉన్న చెట్టుమీదనే మరొక కొమ్మమీద కాకి కూర్చుని ఉన్నది. అది గుడ్లగూబ మూలుగు విని, "ఏం బావగారూ? ఎందుకు మూలుగుతున్నారు?" అని అడిగింది.

"ఉన్నట్టుండి డొక్కలో పోటు ప్రారంభమయిందిరా, కాకి బావా!" అన్నది గుడ్లగూబ బాధతో మాట్లాడుతూనూ.



"డొక్కలో పోటే! దాన్ని ఉపేక్షించరాదు. వెంటనే చికిత్స చేయించండి, బావగారూ. కోయిల గట్టి వైద్యుడు. ఎంత లేసి గడ్డు రోగాల్ని ఇట్టే కుదిర్చేస్తాడు," అన్నది కాకి.

"అలా అయితే పోయి ఆ వైద్యుణ్ణి పిలుచుకు వద్దూ, నీకు పుణ్యం ఉంటుందీ! అమ్మో, బాధ!" అన్నది గుడ్లగూబ.

కాకి తక్షణమే బయలుదేరి వెళ్లి కోయిలను పిలుచుకు వచ్చింది.

కోయిల గుడ్లగూబను ఆపాదమస్తకం పరీక్షించి, దాని బాధకు కారణం మట్టి ఉండ అని తెలుసుకున్నది.

"నా పరీక్ష అయిపోయింది. నాకు ఇంత ఇచ్చినట్టయితే చికిత్స కూడా చెప్పగలను," అన్నది కోయిల. గుడ్లగూబ పిసినిగొట్టు. అందుకే కోయిల అంత నిష్కర్షగా తన ప్రతిఫలం గురించి మాట్లాడింది.

"ఒక చెంప చస్తుంటే నీ ఫీజు గురించి దిగులుపడతా వేమిటి? వెంటనే చికిత్స ప్రారంభించు. ఇస్సా, అబ్బా!" అని గుడ్లగూబ మూలిగింది.

కోయిల సంశయంగా ఉన్నట్టు కనబడింది. అది చూసి కాకి, "నీ ఫీజు గురించి విచారించకు, డాక్టరూ! చికిత్స



చేసెయ్యి. నీ ఫీజుకు నేను పూచీ ఉంటాను," అని చెప్పింది.

"సరే, అయితే చికిత్స చెబుతాను. రోగి భుజం లోతు నీటిలో కొంత సేపు కూర్చున్న మీదట బాధ దానంతట అదే పోతుంది," అన్నది కోయిల.

వెంటనే కాకి ఎగిరి వెళ్ళి, గుడ్లగూబ కూర్చోవటానికి తగిన నీటిగుంట కోసం వెతికి, కనిపెట్టింది. గుడ్లగూబ వెళ్ళి అందులో కూర్చున్నది. కొద్ది సేపట్లోనే మట్టి ఉండ నాని, మెత్తబడి, గుడ్లగూబ డొక్కలో నుంచి జారి నీటిలో పడిపోయింది. గుడ్లగూబ బాధంతా చేత్తో తీసేసినట్టుగా పోయింది. గుడ్లగూబ సుఖంగా ఇంటికి తిరిగి వచ్చేసింది.

మర్నాడు కోయిల గుడ్లగూబను చూడ వచ్చి, వ్యాధి నివారణ అయిందని విని, "నా ఫీజు మాట ఏమిటి?" అన్నది.

"నీటిలో కూర్చోమనటం ఒక చికిత్సా? దానికి ఫీజా? ఎవరన్నా వింటే నవ్వి పోతారు," అన్నది గుడ్లగూబ.

"అదేమన్న మాట? రోగస్థితిలో బాధ పడుతూ నన్ను పిలిపించావు. నేను శ్రద్ధగా రోగనిదానం చేసి చికిత్స చెప్పాను. నా చికిత్స ఫలించింది. మరి నా ఫీజు ఇచ్చుకోక తప్పేదేమున్నదీ?" అన్నది కోయిల.



"నేను నీ కేమీ ఇవ్వను. నీటిలో కూర్చొ మనటం చికిత్సేకాదు," అన్నది గుడ్లగూబ.

"ఆ సంగతేదో కాకినే అడిగి తేల్చు కుంటాను. తాను నా ఫీజుకు పూచీ ఉంటా నన్నది గద!" అని కోయిల కాకిని చూడ బోయింది.

"ఇవ్వటానికి నాదగ్గిరేమున్నది? ఈ పక్షి రాజ్యంలో నాకన్న కటిక దరిద్రుడు లేడు," అన్నది కాకి.

పక్షిరాజ్యానికి రాబందు న్యాయాధికారి. అందుచేత కోయిల రాబందు వద్దకు వెళ్ళి తన ఫీజు విషయమై గుడ్లగూబ మీదా, హామీ ఉంటానన్న కాకి మీదా దావా తెచ్చింది.

కేసు విచారణ జరిగింది.

"కోయిలకు ఫీజు ఇచ్చుకుంటా నని ఈ నా నోటితో నేను అనలేదు," అని గుడ్ల గూబ న్యాయస్థానంలో ప్రమాణం చేసింది.

కాకి మటుకు తాను కోయిల ఫీజుకు హామీ ఉంటానన్న మాట నిజమేనని ఒప్పు కుంటూ, తనకు ఆర్థికంగా ఏమాత్రమూ శక్తి లేదని అన్నది.

"ఆర్థికంగా శక్తిలేని పక్షంలో సేవచేసి అయినా కాకి కోయిల ఋణం తీర్చుకోవలిసి ఉంటుంది. అందుచేత ఇకనుంచీ కోయిల గుడ్లను కాకి పొదగాలనీ, పిల్లలను సాకాలనీ మేము ఉత్తరువు చేస్తున్నాం," అని రాబందు తీర్పు చెప్పింది.

కనకనే ఈనాటికీ కాకులు కోయిల గుడ్లను తమ గుడ్లతోబాటు పొదిగి, కోయిల పిల్లలకు రెక్కలు వచ్చినదాకా సాకుతాయి.

పోతే, గుడ్లగూబ సంగతి. కోయిల తెచ్చిన ఫిర్యాదు మూలంగా గుడ్లగూబ అంటే మిగతా పక్షులన్నిటికీ అసహ్యం పుట్టి పోయింది. అందుచేత అది పగటిపూట ఏ పక్షి కంటా పడకుండా తన గూట్లో దాగి ఉండి, పక్షులన్నీ తమ గూళ్ళు చేరి నిద్ర పోయే రాత్రి సమయంలో అది తిండి వెతుక్కుంటూ బయలుదేరుతుంది.





# శిథిలాలయం

## 9

[కొండగుహలో శిఖిముఖీ, విక్రమకేసరులకు శిథిలాలయ పూజారి కనిపించలేదు. అక్కడ దొరికిన ఎలుగుబంటును వాళ్ళు నవరగండుపోతు ముఠావాళ్ళకు ఒప్ప చెప్పారు. నాగుమల్లి దాన్ని కొంతసేపు ఆడించి, యివతలికి రాగానే, అది చుట్టూ చేరిన గుంపు మీద విరుచుకు పడింది. దాన్ని పట్టుకునేందుకు శిఖిముఖీ, నాగుమల్లి పరిగెత్తారు. తరవాత—]

ఎలుగుబంటు చేత గాయపడిన వాళ్ళల్లో ఎక్కువమంది నవర స్త్రీలూ, పిల్లలూ. మగవాళ్ళు దాన్ని చంపేందుకు యీటెలూ, కర్రలూ అందుకునేలోపలే ఎలుగుబంటు చేయవలసిన ఘోరం అంతా చేసి, పారి పోయే ప్రయత్నంలో వున్నది. ఆ దశలో దాన్ని పట్టుకునేందుకు నాగుమల్లీ, శిఖి ముఖీ ముందుకురికారు. వాళ్ళు ఎలుగు కేసి పరిగెత్తటం చూసిన నవరలు ఈటెల్ని దానికేసి విసరకుండా ఆగారు. అవి గురి తప్పి తమ నాయకుడి కూతురుగ్గాని, శిఖి ముఖిగ్గాని తగలవచ్చని వాళ్ళు భయపడ్డారు.

ఎలుగుబంటు ఒకసారి రెండు కాళ్ళ మీదా నిలబడి తనను సమీపిస్తున్న నాగు మల్లి మీదికి దూకబోయింది. నాగుమల్లి ఏమీ చలించక పిడికెళ్ళు బిగించి వున్న చోటునే నిలబడింది. అసరికి ఎలుగును సమీపించిన శిఖిముఖి కాలితో బలంగా





దాని నడుం మీద ఓ తన్ను తన్నాడు. ఎలుగుబంటు గోండ్రిస్తూ కిందపడి చప్పున లేచి అరణ్యం కేసి పరిగెత్తసాగింది.

పీడ విరగడయిందన్నట్టు చూసి, శిఖిముఖి వెనుదిరగబోయాడు. కాని అంతలో అతడి దృష్టి మెరుపులా ఎలుగుబంటు కేసి పరిగెత్తుతున్న నాగుమల్లి మీద పడింది. యిప్పుడామె చేతిలో ఒక యీటె వున్నది. వెనక నుంచి తండ్రి గండుపోతూ మరి కొందరూ ఆగమని కేకలు పెడుతున్నా ఆమె లక్ష్యపెట్టకుండా ముందుకు పరిగెత్తసాగింది.

నాగుమల్లి సాహసం చూసి శిఖిముఖి మనసులోనే మెచ్చుకున్నాడు. కాని, ఆమె చేస్తున్నది దుస్సాహసమనీ, ప్రమాదం తెచ్చి పెట్టేదనీ అతడికి తోచింది. ఆ వెంటనే అతడు, "మల్లీ!" అంటూ కేకపెట్టి ఆమె కేసి పరిగెత్తాడు. ముందు ఎలుగుబంటూ, దానికి కొంచెం వెనకగా నాగుమల్లీ, ఆమెకు కాస్త దూరంలో శిఖిముఖీ పరిగెత్తుతూ, చూస్తూండగానే అరణ్యవృక్షాల వెనక మాయమయారు.

"ఆ ఎలుగుబంటు రూపంలో వున్నవాడు పూజారే! సందేహంలేదు. ఆ పూజారి కుక్క మంత్ర తంత్ర విద్యల్లో సాటిలేనివాడు. శివాలూ! వాడు నాకూతుర్నీ, నీ కొడుకునూ చంపటానికో లేక ఎత్తుకుపోవటానికో, యీ మాయారూపంలో వచ్చాడు. ఇద్దర్నీ సమ్మోహపరిచి వెంట తీసుకుపోయాడు. ఇప్పుడేంచేయటం?" అంటూ గండుపోతు అరవసాగాడు.

శివాలుడికి, పూజారి శక్తిసామర్థ్యాల్లో గండుపోతుకున్నంత గుడ్డినమ్మకం లేదు. ఎలుగుబంటును తరుముకుంటూ తన కొడుకూ, గండుపోతు కూతురూ పరిగెత్తటంలో అతడికి పూజారి సమ్మోహన విద్య ఏమీ వున్నట్టు అనుమానం కలగలేదు. కాని, వాళ్ళిద్దరూ ఒకసారి కీకారణ్యంలో జొరపడిం తరవాత, ఆ దుర్మార్గుణ్ణించి





ఎలాంటి ప్రమాదమైనా సంభవించవచ్చని అతడికి కొంచెంగా భయం కలిగింది.

శివాలుడు ఏమి చేయటమా అని ఆలో చించేంతలో విక్రమకేసరి ముగ్గురు శబరుల్తో అతణ్ణి సమీపించి, "శివాలా! నేను శిఖి ముఖికి సాయం వెళతాను. అతడికి ఎలుగు బంటు నుంచి ప్రమాదం వస్తుందని కాదు, నా భయం. ఆ శిథిలాలయు పూజారి యీ చుట్టుపక్కల అరణ్యంలో ఎక్కడో మాటేసి వుంటాడని నానమ్మకం," అన్నాడు.

"నేనూ అదే అనుకుంటున్నాను, కేసరీ! వాణ్ణీ, నాగుమల్లినీ కనపడిన వాళ్ళను కనపడినట్టు యిక్కడికి లాక్కురండి," అన్నాడు శివాలుడు.

"నేను వద్దని కేకలు పెడుతున్నా పరి గెత్తింది, నాగు. నేను వెంటనే తిరిగి రమ్మన్నానని చెప్పండి," అని గండుపోతు విక్రమకేసరితో చెప్పి, అతడు బయలుదేరి పోబోతూండగా భుజంపట్టుకు ఆపి, "ఆ ఎలుగ్గొడ్డుందే—అది పూజారి అనే నా అను మానం. దాన్ని దొరికితే ప్రాణాలతో యిక్క డికి పట్టుకురాకండి, చంపి చర్మం వలు చుకువస్తే సరిపోతుంది. ఆ చర్మాన్ని ఎండ గట్టి నా ఇంటి గడప దగ్గిర కాళ్ళుతుడుచు కునేందుకు ఉపయోగిస్తాను," అన్నాడు.



విక్రమకేసరి అతడి మాటలకు సరే అని తలూపి, అనుచరులతో అరణ్యం కేసి పరుగు తీశాడు. వాళ్ళు అరణ్యం చేరగానే, "శిఖిముఖీ! శిఖిముఖీ!" అంటూ కేకలు ప్రారంభించారు. కాని, జవాబు రాలేదు. వాళ్ళల్లో కొందరు అడుగు జాడల కోసం నేలమీద వెతకటం ప్రారంభించారు. ఆ ప్రాంతాల అడవిజంతువులూ, మనుషులూ నడిచిన కాలి గుర్తులు అనేకం కంటబడినై. నాగుమల్లీ, శిఖిముఖుల కాలిగుర్తులు వాటిల్లో ఏవో తెలుసుకోవటం ఎలా?

"ఎలుగుబంటు వాళ్ళిద్దర్నీ అరణ్యంలో చాలా లోపలికి తీసుకుపోయినట్టుంది.





బంటును కొండగుహ దగ్గిర పట్టుకుని సవర పల్లెకు చేర్చింది తను....

శిఖిముఖి యిలా ఆలోచిస్తూ ఎలుగు బంటూ, నాగుమల్లుల వెనక కొండలోయలో వున్న అరణ్యంలోకి చాలా దూరం పరిగెత్తారు. చివరకు ఎలుగుబంటు బాగా అలిసిపోయినట్టుంది. అది ఒక టేకుమాను పక్కన నిలబడి కోరలు చాస్తూ, చిన్నగా గాండ్రించసాగింది. నాగుమల్లి దాన్ని సమీపించి చేతిలోని యీటెతో దాని గుండెల మీద పొడవబోయింది. కాని, ఎలుగు ఆ దెబ్బ తప్పుకుని మాను వెనకకుపోయి గాండ్రిస్తూ నిలబడింది.

ఆ సమయంలో శిఖిముఖి, నాగుమల్లిని సమీపించాడు. నాగుమల్లి అతడి రాకను చూసీ, చూడనట్టు తల పక్కకు తిప్పుకుని ఎలుగుబంటి మీద యీసారి యీటెతో కలియబడేందుకు, దాని కేసి ఒక్కొక అడుగే వేయసాగింది.

"మల్లీ, దానికి మరీ దాపులకు వెళ్ళకు. పారిపోయే ఆశలేనప్పుడు క్రూరమృగం ఎంత సాహసం చేయగలదో, నీకు తెలీదా?" అన్నాడు, శిఖిముఖి.

"అహఁ, తెలీదు! శబరకుర్రాడొచ్చి చెపితే తప్ప, ఏది ఎలుగుబంటో, ఏది ఎలక

మనం రెండు ముఠాలుగా చీలి వెతకటం వల్ల ప్రయోజనం వుండొచ్చు," అన్నాడు కేసరి. ఆ వెంటనే ఇద్దరిద్దరు ఒక జట్టుగా బయలుదేరి అరణ్యంలో కేకలు పెడుతూ శిఖిముఖీ, నాగుమల్లీ కోసం వెతకసాగారు. కాని, నాగుమల్లీ, శిఖిముఖులు ఆ ప్రాంతాల ఎక్కడా లేరు. తన కులంవాళ్ళను గాయపరిచింది గనక, ఎలుగును చీల్చి చెండాడాలన్న కోపంతో నాగుమల్లి దాన్ని వెంటబడి తరమసాగింది. తమ కాతిథ్యం యిస్తున్న గండుపోతు కూతురు ప్రమాదంలో చిక్కుకుంటుందేమో అని శిఖిముఖి ఆమెను వెన్నంటి పరిగెత్తసాగాడు. పైగా, ఆ ఎలుగు





పెల్లో కూడా నాకు తెలీదు," అని వెటకారంగా అంటూ నాగుమల్లి తల తిప్పి శిఖిముఖి కేసి చూడబోయేంతలో, అదే అవకాశంగా తీసుకుని ఎలుగుబంటు ఆమె మీదికి దూకింది. కాని, అది మీదికి దూకబోయేముందు పెట్టిన గుర్రుధ్వని వింటూనే నాగుమల్లి ఈటెను రెండు చేతులతో దాని గుండెల కేసి బలంగా పూపింది. ఈటె ఎలుగు గుండెల్లో గట్టిగా పొడుచుకున్నది. కాని, అది ఎగిరి మీదబడ్డ వేగానికి నాగుమల్లి కాలు నిలదొక్కుకోలేక వెనక్కు పడిపోయింది. ఎలుగుబంటు ఆమె తలను గావుపట్టు పట్టేందుకు పెద్దగా నోరు తెరిచింది.

శిఖిముఖి నడుం నుంచి వేలాడుతున్న చురకత్తిని చర్రునలాగి, మెరుపులా ఎలుగుబంటి మీదికి దూకి, ఎడంచేత్తో దాని కంఠాన్ని వెనక్కు లాగుతూ, కుడి చేతిలో వున్న చురకత్తిని బలంగా దాని మెడమీద గుచ్చి నరాలు తెగేట్టుగా మెలి తిప్పాడు. ఎలుగుబంటు నాగుమల్లిని వదిలి పెద్దగా గొంఁడ్రిస్తూ, శిఖిముఖి మీద విరుచుకుపడింది. శిఖిముఖి ఒక చేత్తో ఎలుగుబంటి మెడను గట్టిగా పట్టుకుని, దాని వాడి కోరలకు తన తల దొరక్కుండా చూసుకుంటూ, చురకత్తితో దాని శరీరం మీద అందిన చోటనల్లా బలంగా పొడవసాగాడు.





ఈలోపల నాగుమల్లి లేచి నిలబడింది. ఆమెకు శిఖిముఖి మీద తన తండ్రిని కొట్టి గాయపరిచాడన్న పగా, కోపం వున్నా, యీ సమయంలో అతడు తనను రక్షించేందుకు ప్రయత్నించి ఎలుగు వల్ల ప్రమాదం తెచ్చుకున్నాడన్న గ్రహింపు కలిగింది. వెంటనే ఆమె ఎలుగుబంటు శరీరంలో దిగి వున్న తన యీటెను ఒక్క గుంజు గుంజి బయటికిలాగి, దానితో ఎలుగు డొక్కలో యిటు నుంచి ఆటు దూసుకుపోయేట్టుగా ఒక్క పోటు పొడిచింది. ఎలుగుబంటు ఒకసారి పెద్దగా గోండ్రించి, వెల్లికిలా పడి గిలగిల తన్నుకోసాగింది.



శిఖిముఖి లేచి నిలబడ్డాడు. అతడి శరీరం మీద అక్కడక్కడా ఎలుగుబంటి వాడి గోళ్ళవల్ల చిన్నచిన్న గాయాలై కొద్దిగా నెత్తురు కారుతున్నది. అతడి కుడి చేతిలోని చురకత్తి రక్తం ఓడుతున్నది.

నాగుమల్లి అతణ్ణి నఖశిఖ పర్యంతం ఓసారి పరీక్షగా చూసి చిరునవ్వు నవ్వబోయి అంతలోనే ముఖం మీద చిరుకోపం కనబరుస్తూ, "అంత చిన్న కత్తితో ఎవరైనా ఎలుగుబంటు మీద కలియబడతారా? మీ శబరకులం వాళ్ళల్లో ధైర్యసాహసాలున్నయ్యేమోగాని, యుక్తి నేర్పుల్లాంటివి కనబడవు. నీకేమైనా ప్రమాదం జరిగివున్నట్టయితే, అందుక్కారణం నేనని, మీ తండ్రి మామీద దొమ్మీ చేసివుండేవాడు," అన్నది.

"యుక్తులూ, కుయుక్తులూ మనుషుల మీద పారినంత తేలిగ్గా, క్రూరమృగాల మీద పారవు. నిన్ను చంపబోతున్న ఎలుగును ఏ యుక్తి నేర్పూ వుపయోగించి నేను విడిపించగలిగేవాణ్ణి? ఆ క్షణంలో నా దగ్గిర యీ చిన్న కత్తి కూడా లేకపోతే, వట్టి చేతులతోనే దానిమీద కలియబడి వుండేవాణ్ణి," అన్నాడు శిఖిముఖి.

నాగుమల్లి ఆ మాటలకు కొంచెంగా ఆశ్చర్యపోయి, "నీ శత్రువు కూతురు







ప్రాణాలు కాపాడేందుకు అంత సాహసం చేసేవాడివా?" అని అడిగింది.

"గండుపోతు నాకు శత్రువు కాదు. ఏ పరిస్థితుల్లో మేం యిద్దరం యీటెలు తీసుకుని పోట్లాడుకోవలసి వచ్చిందో, ఆ సంగతి మీవాళ్ళకూ మావాళ్ళకూ కూడా బాగా తెలుసు. జరిగిపోయిందాన్ని గురించి యిప్పుడు వాదోపవాదాలెందుకు? ఈ గాయాలకు ముందు ఆకుపసరు పూయాలి. నీవూ బాగా గాయపడ్డావు. వాటి నుంచి తీపూ సలపరం మొదలవక ముందే ఆకు రసం తెచ్చి పూసుకో. నెత్తురు కట్టించి గాయాన్ని మాన్పే ఓషధీ పత్రాలేవో గుర్తించి తెచ్చుకో గలవా? లేక నేను కోసుకొచ్చిపెట్టనా?" అంటూ శిఖిముఖి చుట్టూ ఓమారు కలయ చూసి, మహావృక్షాలకు దిగువున అల్లిబిల్లిగా పెరిగిన పొదల కేసి బయలుదేరాడు.

నాగుమల్లి అతణ్ణి ఆగమని హెచ్చరించి, "నేనూ అరణ్యంలో పుట్టి పెరిగినదాన్నే. మందుకు పనికొచ్చే ఆకులేవో నాకు తెలియనివికావు. వాటిని నీకూ్కడా నేనే తెచ్చి యిస్తాను. మావాళ్ళు అన్నట్టు ఈ చచ్చిన ఎలుగుబంటు ఆ దొంగ పూజారేనేమో! లేచి పారిపోకుండా చూస్తూండు," అంటూ చిరునవ్వునవ్వి చెట్లల్లోకి పోయి, నాలుగైదు నిమిషాల్లో యిన్ని ఆకులు గుప్పెళ్ళతో పట్టుకు వచ్చింది.

నాగుమల్లి తిరిగి వచ్చేసరికి, శిఖిముఖి ఒక ఎండుమోడు మీద కూర్చుని ఆమెను గురించే దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు. నాగుమల్లి కనబరిచిన ధైర్యసాహసాలేకాక, ఆమె అందచందాలు కూడా అతడి హృదయాన్ని బాగా ఆకర్షించినై.

"ఏమిటాలోచన? ఇదుగో ఆకురసం!" అంటూ నాగుమల్లి, శిఖిముఖిని సమీపించింది. అతడు ఉలిక్కిపడి నిద్ర లేచినట్టు ఆమె కేసి చూసి, చేయి చాపాడు. కాని నాగుమల్లి ఆకుల్ని అతడి కివ్వక, "నీవు



మీదా, భుజాలమీదా కూడా ఎలుగు గోళ్ళతో బాగా రక్కింది. అక్కడ పసరు రాసు కోవటం నీవల్ల నేమవుతుంది? నేరాస్తాను," అంటూ శిఖిముఖి గాయాల మీద ఆకు నలిపి దాని పసరు పూయసాగింది.

శిఖిముఖి పసరు తగిలినప్పుడల్లా భగ్గుమని మండే గాయాల బాధ మరిచి పోయి, ఆమె ముఖం కేసి చూస్తూ వుండి పోయాడు. పసరు రాయటం పూర్తవగానే నాగుమల్లి అతణ్ణించి కొంచెం ఎడంగా పోయి తన శరీరం మీది గాయాలకు పసరు రాసుకోబోయింది. కాని, శిఖిముఖి చప్పున లేచి ఆమె దగ్గరకుపోయి, చేతిలో వున్న ఆకుల్ని లాక్కునేందుకు ఆమె గుప్పెళ్ళను బలంగా పట్టుకుని, "నాకు నువ్వు చెప్పిందే, నీకూ చెల్లుతుంది. ఇప్పుడు వంతు నాది," అంటూ ఆమె యిచ్చిన ఆకుల్ని మరి కాస్త రసం వచ్చేలా అరచేతుల్తో నలిపి, ఆమె శరీరం మీద దెబ్బలు తగిలినచోటనల్లా రాయసాగాడు. నాగుమల్లి లేని బాధను కన బరుస్తూ చిన్నగా మూలుగులు ప్రారం భించింది.

ఈ స్థితిలో లోయపైనున్న కొండభాగం మీది గుబురు చెట్లల్లోంచి, "నా బిడ్డల్లారా! అహ్హహ్హ!" అన్న వికృత కంఠ ధ్వని విని పించింది. శిఖిముఖీ, నాగుమల్లీ తలలు ఎత్తి పైకి చూశారు.

"మిమ్మల్నిద్దర్నీ హిమాలయాలకు అటూయిటూ నూరు యోజనాల వరకూ మహారాజూ, మహారాణీలను చేయబో తున్నాను. ఇడుగో, నా దూత మీ దగ్గిరికే వస్తున్నాడు. వాడిద్వారా నా సందేశం సర్వం తెలుసుకోండి," అంటూ ఆ వికృత కంఠం మరోసారి పలికింది. తలలు ఎత్తి నిశ్చేష్టులై చూస్తున్న శిఖిముఖీ, నాగుమల్లుల కేసి చెట్ల కొమ్మల మీదుగా ఒక మానవా కారం, ఎగురుతున్న పక్షిలా చేతులు చాచి కిందికి దిగసాగింది. —(ఇంకా వుంది)






# పితృహత్య

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువు ఏ మహత్తర శక్తి కోరి ఇలా శ్రమపడుతున్నావో తెలియదు. కాని కల్లబొల్లి శక్తులను సమ్మినట్టయితే మహాబాహువు లాగే చివరకు మోసపోతావు. శ్రమతెలియకుండా నీకు మహాబాహు వృత్తాంతం చెబుతాను విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం గంగానదికి దక్షిణాన ప్రభావతి అనే నగరం ఉండేది. ఆ నగరంలో ఒక దేవి ఆలయం ఉండేది. ఆ దేవి గొప్ప మహిమలు గలది అనీ, భక్తుల కోరికలను తీరుస్తుందనీ ప్రతీతి ఉండేది. అందుచేత ఆ దేవిని సందర్శించటానికి ఎక్కడెక్కడి నుంచో యాత్రికులు వచ్చేవారు. సాధార

## బేతాళ కథలు



సికుడు, హంతకుడు. అయితే అతనున్న రాజ్యం సంపన్నమయినది కాదు. అక్కడి రాజు అతన్ని విడవకుండా వేటాడి, అతడి ప్రాణం మీదికి తెచ్చాడు. ప్రభావతీ నగరం సంపన్నమైనది. అంతేగాక, అక్కడి రాజూ, ప్రజలూ చాలా సౌమ్యులని అతను విని ఉన్నాడు. ప్రభావతీ నగరంలోని దేవిని గురించి కూడా అతను విని వున్నాడు. ముందుగా ఆ దేవి అనుగ్రహం సంపాదించుకుని, ఆ తరవాత ప్రభావతీ నగరంలోనే తన దొంగవృత్తి కొనసాగించుకోవాలని మహాబాహు ఉద్దేశం.

ణంగా భక్తుల కోరికలు తీరుతూనే ఉండేవి. దేవి ఒకటి రెండు సందర్భాలలో పలికిందని కూడా చెప్పుకునేవారు. ఆమె మహిమ గురించి ప్రజలలో ఎలాటి విశ్వాసం వ్యాప్తి చెందిందంటే, ప్రభావతీ నగరాన్ని దేవి స్వయంగా కాపాడుతున్న దనుకుని శత్రు రాజులు సైతం ఆ నగరం కేసి చూడటానికే భయపడుతూ వచ్చారు. ఈ కారణం చేత ప్రభావతీ నగరం శాంతిసౌభాగ్యాలతో విలసిల్లింది.

ఇటువంటి నగరానికి మహాబాహు వనే గజదొంగ పొరుగుదేశం నుంచి పారిపోయి వచ్చాడు. మహాబాహువు అత్యంత సాహ

ఒక రోజు తెల్లవారగట్ట మహాబాహువు దేవి ఆలయాన్ని చేరుకున్నాడు. గుడి పూజారికి వేకువతోనే గుడికి రావటం అలవాటు. చేతిలో కత్తి పట్టుకుని భయంకర రాకారు డెవరో గుడి కేసి వస్తూ ఉండటం చూసేసరికి పూజారికి పై ప్రాణాలు పైనే పోయినట్టయింది. అతను చప్పున అమ్మ వారి విగ్రహం చాటున ఉన్న రహస్యపు అరలో దాక్కున్నాడు.

మహాబాహువు గుడిలోకి ప్రవేశించి, అమ్మవారి విగ్రహం ముందు సాగిలబడి మొక్కి, "తల్లీ, జగజ్జననీ. నేను మహాబాహువును. నీ భక్తుణ్ణి. నా దేశాన్నీ,

భార్యనూ వదిలిపెట్టి, నీ శరణుజొచ్చాను. నన్నెవరూ జయించకుండా వరమియ్యి," అన్నాడు. మహాబాహువు అనే పేరు వినగానే పూజారి కాళ్ళు చల్లబడ్డాయి. అతను ఆ దుర్మార్గుణ్ణి గురించి చాలా విని ఉన్నాడు.

మహాబాహువు కొంచెంసేపు చూసి, "అంబా, పలకవేం?" అని గర్జించాడు. కాని అంబ పలకలేదు.

"నువు పలుకుతావన్నారు. నీకు రక్తం కావాలా? ఇంద నా రక్తం తీసుకో!" అంటూ మహాబాహువు తన కత్తితో వేలు కోసుకుని, అమ్మవారి విగ్రహం ముందు బొటబొటా రక్తం కార్చాడు.

అప్పటికీ దేవి పలక్కపోవటం చూసి ఆ దుర్మార్గుడు, "అయితే నీలో మహత్తేమీ లేదా? లోకాన్ని వంచిస్తున్నావా? నిన్ను ఈ క్షణమే నాశనం చేస్తాను," అని ఉగ్రంగా అరిచాడు. వెంటనే అమ్మవారి నోట మాటలు వెలువడ్డాయి:

"వత్సా, తొందరపడకు. నీ భక్తికి మెచ్చాను. నిన్ను ఎవరూ జయించకుండా వరం ఇచ్చాను. యథేచ్ఛగా వెళ్ళు."

ఈ మాటలు అన్నది పూజారే. అతను దాగిన అరలో ఒక గూడున్నది. ఆ గూటి నుంచి అమ్మవారి విగ్రహం అడుగుకుండా



నోటి దాకా సన్నని బిలం ఉన్నది. అందుచేత పూజారి అన్న మాటలు అమ్మవారి నోటనే వెలువడ్డట్టు మహాబాహువుకు తోచింది. అదీ గాక గర్భగుడిలో మహాబాహువు తప్ప మరొక ప్రాణి ఉన్నట్టు లేదు. మహాబాహువు దేవికి మళ్ళీ సాగిలపడి మొక్కి, "ధన్యుణ్ణి తల్లీ! ధన్యుణ్ణి! ధన్యుణ్ణి!" అనుకుంటూ వెళ్ళిపోయాడు.

పూజారి ఈ వృత్తాంతం ఎవరికీ చెప్పలేదు. అయితే, మహాబాహు వనే పరమ దుర్మార్గుడు ప్రభావతీనగరం వచ్చాడనీ, తనను ఎవరూ జయించకుండా దేవి వరమిచ్చిందనీ ఊరంతా పాకిపోయింది. ఎందు



పొందినవాడు ఎలాగూ మానవప్రయత్నాలకు లొంగడనీ రాజుకు సలహా ఇచ్చారు.

ప్రభావతీనగరానికి ఈ మహాబాహువు బెడద తన మూలానే ఏర్పడిందని తెలిసిన పూజారి మానసికంగా చాలా వ్యథపడి పోయాడు. వాణ్ణి కడతేర్చే బాధ్యత తన పైన ఉన్నదని అనుకున్నాడు.

మహాబాహువు దేవిఆలయానికి వచ్చిన కొద్ది రోజుల అనంతరం ఒకనాటి తెల్లవారు ఝామున ఒక స్త్రీ, పొత్తిళ్ళలో ఒక బిడ్డను తీసుకుని వచ్చి, ఆ బిడ్డను గర్భగుడిలో అమ్మవారి దగ్గిర పెట్టి వెళ్ళిపోబోయింది. ఇది చూసిన పూజారి ఆమెను ఆపి, "ఎవరమ్మా నువు? ఇక్కడ ఏం చేస్తున్నావు? ఆ బిడ్డ ఎవరు?" అని అడిగాడు.

"అయ్యా, నేను మహాబాహువు భార్యను. నా భర్త పారిపోయాక నా కి బిడ్డ కలిగాడు. నా భర్త చేసిన దౌర్జన్యకార్యాలకు ప్రజలు నా పైనా, నా బిడ్డ పైనా పగతీర్చుకుంటారు. అందుచేత ఈ బిడ్డను ఇక్కడ వదిలి, నా దారిన నేను ఎటైనా పోదామనుకున్నాను. మీ రీ బిడ్డను కాపాడి పుణ్యం కట్టుకోండి," అని చెప్పి ఆ స్త్రీ వెళ్ళిపోయింది.

ఆమె వదిలిపోయిన బిడ్డను చూడగానే పూజారికి ఒక ఆలోచన వచ్చింది. అతను

కంటే, తన సౌకర్యం కొరకూ, ప్రతిష్ఠ కొరకూ మహాబాహువే ఈ విషయాన్ని ప్రచారం చేసుకున్నాడు.

అంబ తన పక్షాన ఉన్నదన్న ధైర్యంతో మహాబాహువు యథేచ్ఛగా దొంగతనాలూ, దోపిడీలూ, హత్యలూ చెయ్యసాగాడు. దేవికి ప్రియభక్తు డన్న మూఢనమ్మకంతో ప్రజలు వాడి ఆటలు సాగనిచ్చారు. రాజుగారు మహాబాహువును వేటాడి రూపుమాప దలచి నప్పుడు, మంత్రులు మొదలైన వారంతా ఏకకంఠంగా, అలాటి పని కలలో కూడా అనుకోవద్దనీ, దేవికి ఆగ్రహం తెప్పించ వద్దనీ, అజేయుడుగా దేవి నుంచి వరం

ఆ బిడ్డను తన ఇంటికి తీసుకుపోయి, దేవి స్వయంగా తనకా బిడ్డను ప్రసాదించిందని అందరితోనూ చెప్పి, ఆ బిడ్డకు దేవీదత్తుడని పేరు పెట్టి పెంచసాగాడు. కుర్రవాడికి బల పరాక్రమాలూ, కత్తిసామూ, ఇతర క్షత్రియ విద్యలూ నేర్పించి, "నాయనా, దుష్ట సంహారం కోసమే దేవి నిన్ను నాకు ప్రసాదించింది. మహాబాహువు వంటి దుర్మార్గులను నిర్మూలించటానికే నువు జన్మఎత్తావు. ఇది దేవి ఆదేశం," అని పూజారి దేవీదత్తుడికి నూరిపోస్తూ వచ్చాడు.



దేవీదత్తుడి చేతిలో మహాబాహువు లాంటి దుర్జనులకు చావు రాసిపెట్టి ఉన్నదన్న సంగతి కూడా అంతటా వ్యాపించింది. ఈ మాట విని మహాబాహువు కూడా జంకాడు. ఎందుకంటే అతనికి దేవి మహిమలో అపార మైన విశ్వాసం ఉన్నది. ఆమె కృప వల్లనే తనను ఈ ప్రభావతీనగరంలో ఎవరూ ఏమీ చెయ్యలేకుండా ఉన్నారని అతనికి గట్టి నమ్మకం. అందుచేత మహాబాహువు దేవీదత్తుణ్ణి తప్పించుకుని తిరుగుతూ వచ్చాడు.

దేవీదత్తుడు ఇరవైఏళ్ళవాడై ఉండగా ఒకనాడు రాజకుమార్తె పల్లకిలో ఎక్కి, సపరివారంగా దేవి ఆలయానికి పోతూండగా చూసి మహాబాహువు రాజకుమార్తె పైకి లంఘించాడు. రాజభటులు ఉండి కూడా మహాబాహువును ఎదిరించటానికి భయ పడ్డారు. ఆ సమయంలో కొంత దూరాన ఉన్న దేవీదత్తుడు కత్తి దూసి పరిగెత్తుకుంటూ వచ్చి, మహాబాహువు మీద కలియబడ్డాడు. ఇద్దరికీ హోరాహోరి యుద్ధం జరిగింది. తనను ఎదిరించినవాడు దేవీదత్తుడని తెలియగానే మహాబాహువు సగం చచ్చినట్టు అయిపోయాడు. దేవీదత్తుడు అతన్ని తేలికగా కడతేర్చాడు.

మహాబాహువు మరణించాడన గానే నగరవాసులు ఉత్సవాలూ, వేడుకలూ జరిపారు. రాజుగారు దేవీదత్తుడి పరాక్రమానికి

మెచ్చుకుని, అతనికి తన కుమార్తె నిచ్చి పెళ్ళిచేశాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, పూజారి ప్రవర్తన గురించి నాకు కొన్ని సందేహాలున్నాయి. అతను మహాబాహువు పొందిన వరం గురించి ప్రజలకు నిజం ఎందుకు చెప్పలేదు? చెబితే మహాబాహువును ప్రజలు ఏనాడో అవలీలగా చంపి ఉండక పోయూరా? అదీగాక, ఆ మహాబాహువును చంపటానికి అతని కొడుకునే నియోగించి, పూజారి పితృహత్యకు ఎందుకు కారకుడయాడు? ఈ ప్రశ్నలకు సమాధానాలు తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "దేవి వల్ల దేశమూ, ప్రజలూ ఎంతో లాభం పొందుతున్నారు. దేవి మహత్తులో అందరికీ విశ్వాసం ఉండబట్టే ఆ నగరానికి శత్రుభయం కూడా లేదు. అలాటప్పుడు, దేవి నోట వెలువడ్డ మాటలు తనవేనని పూజారి బయటపెట్టేస్తే ఇక దేవిలో ప్రపంచానికి గురి ఉండదు. అందువల్ల జరిగే నష్టం అంతా ఇంతా కాదు. అందుకే పూజారి మహాబాహువుకు దేవి ఇచ్చిన వరం గురించి నిజం దాచిపెట్టాడు. ఇక, మహాబాహువు లాటి ప్రజాపీడకుణ్ణి ఎవరు చంపినా అది సత్కార్యమే అవుతుంది. అందుకు మహాబాహువు కొడుకే అనుకూలించటం కేవలమూ దైవికం. దానికి పూజారి బాధ్యుడు కాడు. పితృహత్యా చేస్తున్నానన్న భావం కలిగితే దేవీదత్తుడికే కలగాలి. అయితే అతనికి మహాబాహువు తన తండ్రి అని తెలియనే తెలియదు. పూజారి పక్షం నుంచి చూస్తే అతడి మరణం దుష్టశిక్షణ అవుతుంది గాని హత్య కానేకాదు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)





# వింత వస్తువులు

ఒక అరణ్యం మధ్య ఒక గుహలో ఒక వింత ముసలా డుండేవాడు. వాడి వద్ద మూడు వింత వస్తువులుండేవి. ఒకటి అదృశ్యం చేసే టోపీ; దాన్ని నెత్తిన పెట్టు కోగానే ముసలాడు ఎవరికీ కనబడకుండా అదృశ్యమయేవాడు. వాడి వద్ద ఒక చట్టి కూడా ఉండేది. అందులో నుంచి వాడికి కోరినప్పుడల్లా కోరిన ఆహారం దొరికేది. ముసలాడి దగ్గిర ఒక కఱ్ఱ కూడా ఉండేది. అది ఎవరి మీద విసిరితే వాళ్ళను చావగొట్టి తిరిగి వచ్చేది. ఆ నిర్జనమైన అరణ్యంలో ముసలాడు ఎవరి కంటా పడకుండా, ఏ క్రూరమృగం భయమూ లేకుండా, తిండికి ఎలాటి అగచాట్లూ పడకుండా సుఖంగా జీవిస్తున్నాడు.

ఇలా ఉండగా ఒకనాడు ఒక దొంగ ఆ గుహకు సమీపంగా రావటం తటస్థించింది. అరణ్యం దాటి కొంతదూరం పోతే ఒక నదీ, దాని ఒడ్డున నగరమూ ఉన్నాయి. ఆ నదికి పుష్కరం జరుగుతున్నది. దానికి లక్షలాది జనం వస్తారు. అక్కడ యథేచ్ఛగా దొంగతనాలు సాగించ...చ్చునని దొంగ బయలుదేరి వెళ...తున్నాడు.

ఎవరో వ...ప్న అలికిడి చెవిని పడగానే ...పీని నెత్తిన పెట్టు కుని అదృ...ు. గుహ ఎదటికి వచ్చిన దొం...డ ఎవరూ లేకపోవటం చూసి అను...నాడు. ఎందుకంటే గుహలో ఎవరో ఉన్నట్టు దూరాన్నుంచే లీలగా కనిపించింది. ఆ మనిషి దాక్కోవటానికి గుహలో చోటు కూడా లేదు.

అందుకని దొంగ గుహను దాటి పోయినట్టేపోయి, చుట్టు తిరిగి వచ్చి, గుహకు ఎదురుగా ఉన్న రాళ్లగుట్టల వెనక దాగి, రాళ్ళ సందుల్లో నుంచి గుహను జాగ్రత్తగా గమనించ సాగాడు.

బి. పద్మనాభం

ఇక భయం లేదనుకున్న మీదట ముసలాడు నెత్తిన ఉన్న టోపీ తీసి పక్కన పెట్టాడు. టోపీ రహస్యం దొంగకు తెలిసిపోయింది. అటువంటి టోపీ తన వద్దనే ఉంటే దొంగతనం ఎంత సులువుగానైనా చెయ్యవచ్చు. అందుకని వాడు అక్కడే మాటు వేసుకుని కూర్చుని, ముసలివాడు గుహ దాటి అవతలికి వెళ్ళగానే ఆ టోపీ నెత్తిన పెట్టుకుని, అదృశ్యుడై, ఆడుతూ పాడుతూ పుష్కరానికి బయలుదేరాడు.

ముసలివాడు గుహకు తిరిగి వచ్చి, తన టోపీ కనబడక పోయేసరికి పొందిన బాధ ఇంతా అంతా కాదు.

ఇది జరిగిన తరవాత ముసలాడు ఆకలవేసి తన చట్టిని మూల నుంచి తీసి, అందులో నుంచి తిండి తినసాగాడు.

ఇది కూడా మరొక దొంగ కంటపడింది. బోర్లించి ఉండిన చట్టి నుంచి ముసలివాడు భోజనం ఎట్లా చేస్తున్నాడో దొంగకు అర్థం కాలేదు. అందుచేత ఈ రెండో దొంగకూడా ముసలివాడు అవతలికి వెళ్ళినదాకా పొంచి ఉండి, ఆ చట్టిని ఎత్తుకుని పారిపోయాడు.

తన చట్టి కూడా పోయేసరికి ముసలాడు హతాశుడైపోయాడు. ఇంక వాడి దగ్గిర మిగిలి ఉన్నది కర్ర మాత్రమే. అది వాడి కడుపునించలేదు. వాడికి రక్షణకూడా ఇవ్వ



లేదు; క్రూరమృగాల నుంచి కాపాడగలదు. ఆకలితో చావ సిద్ధంగా ఉన్నవాడికి క్రూరమృగాల భయం ఏముంటుందీ?

చావుకు సిద్ధంగా ఉన్న ముసలాడి దగ్గిరికి ఒక యువకుడు వచ్చి, "నాయనా, ఆకలి దహించుకుపోతున్నది. తినటానికేమైనా ఉన్నదా?" అని అడిగాడు.

"నా అక్షయపాత్రనూ, అదృశ్య టోపీనీ దొంగ వెధవలు కాజేశారు. ఆ అక్షయపాత్రే ఉంటే నీ వంటి వాళ్ళకు ఎంతమందికైనా అన్నం పెట్టి ఉందును. ఇదుగో, నా దగ్గిర ఈ కర్ర ఒకటి మిగిలింది. దీన్ని నువు తీసుకుపో," అన్నాడు ముసలాడు.

ముసలాడు పోగొట్టుకున్న వస్తువులను గురించీ, కర్ర గురించీ తెలుసుకుని ఆ యువకుడు, "తాతా, ఈ కర్ర నాకిచ్చెయ్యి. దీని సహాయంతో నీ వస్తువులు నీకు తెచ్చి యిస్తాను," అన్నాడు.

ముసలాడు ఒప్పుకున్నాడు.

యువకుడా కర్ర తీసుకుని, పుష్కర తీర్థం దారిపట్టాడు. వాడు కొంత దూరం వెళ్ళాక, "ఒరే, నీ దగ్గిర ఉన్నదంతా అక్కడ పెట్టు," అన్న మాటలు వినిపించాయి, మనిషి కనిపించలేదు. టోపీ కాజేసిన దొంగ వీడేనని యువకుడికి అర్థమయింది.



"నాదగ్గిర చాలా ఉంది. ముందు నువు కనిపించు," అన్నాడు యువకుడు.

దొంగ తన నెత్తి మీది టోపీ తీసేసి ప్రత్యక్షమయాడు. వెంటనే యువకుడు తన చేతిలో ఉన్న కర్రను దొంగ మీదికి విసిరాడు. దాని దెబ్బలకు తట్టుకోలేక దొంగ పడిపోయాడు.

వాడి దగ్గిర నుంచి టోపీ తీసుకుని యువకుడు ముందుకు సాగాడు.

అక్షయపాత్రను దొంగిలించిన వాణ్ణి పట్టుకోవటం కష్టమవుతుందని యువకుడు అనుకున్నాడు గాని, వాడు కూడా సులువు గానే దొరికిపోయాడు.

నదీ తీరాన ఆ దొంగ ఒక పెద్ద పాకా వేసి, యాత్రికులకు అంతులేని అన్నదానం చేస్తూ, ఒక దిబ్బెం పెట్టి అందులో డబ్బులు వేయిస్తున్నాడు. అందరూ వాణ్ణి ధర్మదాత అని మెచ్చుకుంటూ దిబ్బెంలో డబ్బులు వేస్తున్నారు.

యువకుడు నెత్తిన టోపీ పెట్టుకుని అదృశ్యంగా వంటశాలలో ప్రవేశించాడు. ఆ వంటశాలలోకి దొంగ తప్ప ఇంకెవరూ వెళ్ళటానికి అనుమతి లేదు. ఎవరైనా వెళ్ళితే రహస్యం బయట పడుతుంది. అందులో చట్టి తప్ప ఇంకేమీ లేదు.

యువకుడు ఆ చట్టిని తీసుకుని బయటికి వచ్చేస్తుండగా దొంగ కంట పడింది. వాడికి మనిషి కనబడలేదు గాని, చట్టీ, దాని వెంట ఒక కర్రా గాలిలో తేలిపోతూ ఉండటం కనబడింది.

"ఎవర్రా, అదీ? అగు, అగు!" అని దొంగ అరిచాడు.

మరుక్షణమే యువకుడు విసిరిన కర్ర వాడి పైన పడి చావ గొట్టింది.

ఈ విధంగా యువకుడు ముసలాడి వస్తువులను దొంగల నుంచి తిరిగి సంపాదించి, వాటిని ముసలాడికి చేర్చి, తన దారిన తాను వెళ్ళిపోయాడు.







# నారింజపళ్ళు

అనేకవేల సంవత్సరాల క్రితం పశ్చిమ ఖండంలో ఒక చిన్న రాజుండేవాడు. ఆ రాజుకు ఒకతే కూతురు. ఆమె చాలా మంచిదీ, చక్కనిదీనూ. ఆమె యుక్త వయస్కురాలైన సమయంలో ఆమెకు ఒక విచిత్రమైన వ్యాధి కలిగి, మంచం పట్టి, వాడిపోవ నారంభించింది. వైద్యుడినని చెప్పుకుంటూ తిరిగే ప్రతివాడికీ రాజు తన కుమార్తెను చూపించి, చికిత్స చెయ్య మన్నాడు. కాని ఒక్కరికీ మొదలు వ్యాధి ఏమిటో అంతు బట్టలేదు. ఆమెకు ఆరోగ్యం కలిగించిన వారికి వారి ఎత్తు బంగారం ఇస్తా నని కూడా రాజు ప్రకటించాడు.

ఒకరిద్దరు ఘనవైద్యులు మటుకు రాజ కుమార్తెను పరీకించి, "ఇది ప్రమాదమైన వ్యాధి కాదు. రాజకుమార్తె మూడు నారింజ పళ్ళు తిన్నట్టయితే వెంటనే కోలుకుం టుంది," అన్నారు.

"నారింజ పళ్ళనేవి ఏమిటి? అవి ఎక్కడ ఉంటాయి?" అని రాజు వైద్యుల నడిగాడు. ఎందుకంటే ఆ ప్రాంతంలో నారింజచెట్లు పెరగవు. వాటిని గురించి అక్కడి వారికి తెలియదు.

"అవి తూర్పు ఖండంలో విరివిగా దొరుకుతాయి. ఎవరైనా వెళ్ళేవారుంటే రానూ, పోనూ పధ్నాలుగు వారాల ప్రయాణం," అని వైద్యులు చెప్పారు.

ఈ మాట తెలుసుకుంటూనే రాజు, "తూర్పు ఖండానికి వెళ్ళి మూడు నారింజ పళ్ళు తెచ్చినవారికి నా కుమార్తె నిచ్చి పెళ్లి చేస్తాను," అని చాటింపు వేశాడు.

ఆ చిన్న రాజ్యంలోనే ఒక పేద కాపు స్త్రీ ఉండేది. ఆమెకు ముగ్గురు కొడుకులు. పెద్ద వాళ్ళిద్దరూ సోమరిపోతులు. మూడోవాడు తల్లితోబాటు శ్రమపడి కుటుంబాన్ని పోషిస్తూ ఉండేవాడు.

ఎల్. అనంతరామయ్య



రాజుగారి చాటింపు వింటూనే పెద్దవాడు తల్లితో, "అమ్మా, నేను తూర్పు ఖండానికి పోయి, ఆ నారింజ పళ్ళేవో తెచ్చి, రాజు కూతుర్ని పెళ్ళాడేస్తాను. ఆ తరవాత మన మంతా సుఖంగా ఉండవచ్చు," అన్నాడు.

తల్లి అందుకు ఒప్పుకుని వాడి ప్రయాణానికి భోజనం మూట గట్టి ఇచ్చింది. పెద్ద వాడు ఏడువారాలు ప్రయాణం చేసి తూర్పు ఖండంలోని నారింజ తోటలు చేరుకుని, పచ్చగా పండిన మూడు నారింజపళ్ళు కోసుకుని బుట్టలో పెట్టుకుని, మరి ఏడువారాలు ప్రయాణం చేసి తన ఊరికి చేరుకున్నాడు. రాజభవనానికి ఒక అరకోసు దూరంలో ఉన్న రాజోద్యానంలో ఒక చోట వాడు విశ్రాంతి తీసుకోవటానికి కూర్చున్నాడు.

ఆ సమయంలో ఒక ముసలిది అటుగా వచ్చి, పెద్దవాడి దగ్గిర ఆగి, "ఆ బుట్టలో ఏమిటి, నాయనా?" అని అడిగింది.

"ఏమిటా? కప్పలు!" అన్నాడు పెద్ద వాడు అహంకారంగా.

"తథాస్తు!" అంటూ ముసలిది ముందుకు సాగిపోయింది.

ప్రయాణం బడలిక తీరాక పెద్దవాడు బుట్ట తీసుకుని బయలుదేరి రాజభవనానికి వెళ్ళి, బుట్ట రాజుగారి ముందుంచి, "నారింజ పళ్ళు తెచ్చాను. రాజకుమార్తె నిచ్చి వేగిరం పెళ్ళి చెయ్యండి," అన్నాడు.

రాజు బుట్ట విప్పేసరికి మూడు కప్పలు బయటికి దూకాయి. బుట్టలో నారింజ పళ్ళులేవు.

"ఈ దుర్మార్గుణ్ణి కొరడాతో కొట్టి, చీకటి కొట్టులో తోయించండి," అని రాజు భటులకు ఉత్తరు విచ్చాడు.

పధ్నాలుగు వారాలుగడిచినా పెద్దవాడు తిరిగి రాకపోయే సరికి, పేదరాలి రెండో కొడుకు నారింజపళ్ళు తేవటానికి బయలు దేరాడు. వాడు కూడా తూర్పుఖండానికి పోయి, మూడు నారింజపళ్ళు సంపాదించు

కుని పధ్నాలుగువారాల కల్లా తిరిగి వచ్చాడు. వాడు కూడా తన అన్న కూర్చున్న చోటే విశ్రాంతి తీసుకున్నాడు.

ముసలిది మళ్ళీ అటుగా వచ్చి, "బుట్టలో ఏమిటి, నాయనా?" అని అడిగింది.

"ఏమైతే నీ కేం? పాములు!" అన్నాడు రెండోవాడు.

"తథాస్తు!" అంటూ ముసలిది ముందుకు సాగిపోయింది.

రెండోవాడు తన బుట్టను రాజుగారి ముందుపెట్టి, "నారింజపళ్ళు తెచ్చాను. రాజకుమార్తె నిచ్చి వెంటనే పెళ్ళి చెయ్యండి," అన్నాడు.

కాని బుట్ట విప్పితే పాములు బయట కొచ్చాయి. రాజు రెండో వాణ్ణి చావగొట్టించి, చెరలో పెట్టించాడు.

పధ్నాలుగువారాలు గడిచాయి. ఇద్దరన్నలలో ఒకరూ రాలేదు. అది చూసి మూడోవాడు తానే నారింజపళ్ళు తెస్తానని బయలుదేరాడు. వాడు కూడా తన అన్నల లాగే తూర్పు ఖండానికి వెళ్ళి, నారింజ పళ్ళు సంపాదించి బుట్టలో పెట్టుకుని, పధ్నాలుగువారాలూ అయాక తిరిగి వచ్చి, లోగడ తన అన్నలు విశ్రాంతి తీసుకున్న చోటనే రాజోద్యానంలో ఒక మారుమూలగా కూర్చున్నాడు.





"రాజుగారైతే మాత్రం అన్నమాట నిల బెట్టుకోక తప్పుతుందా? తప్పించుకోవాలని నీకు అసాధ్యమైన పనులు చెబుతాడు. ఆ పనులు చేసే సాధనాలు నేను నీకిస్తాను," అంటూ ముసలిది మూడోవాడికి ఒక కొరడా, ఒక వెండి ఈలా, ఒక బంగారు ఉంగరమూ ఇచ్చి, ఎలా ఉపయోగించాలో చెప్పింది.

మూడోవాడు రాజుగారి వద్దకు వెళ్లి, బుట్ట ఆయన ముందు పెట్టి, "నారింజపళ్ళు తెచ్చాను. రాజకుమార్తెకు వెంటనే చికిత్స చేయించండి," అన్నాడు.

బుట్ట విప్పి చూస్తే మేలిమి బంగారం రంగులో మూడు పళ్ళున్నాయి. రాజుగారు పరమానంద భరితుడై, ఘన వైద్యులను పిలిపించి, "ఇవే నారింజపళ్ళుట. అమ్మాయికి చికిత్స చేయండి," అన్నాడు.

వైద్యులు ఒక పండు ఒలిచి రాజకుమార్తె చేత తినిపించేసరికి ఆమె పక్కలో లేచి కూర్చున్నది. రెండో పండు తినేసరి కల్లా ఆమెకు పూర్వం ఎన్నడూ లేనంత కళ వచ్చింది. మూడో పండు తింటూనే ఆమె, "ఈ పళ్ళు తెచ్చినవాడికే నన్నిచ్చి పెళ్లి చెయ్యండి," అన్నది.

రాజు మూడోవాడి కేసి చూశాడు. ఆయన ముఖం ముడుచుకు పోయింది. అన్నమాట

ముసలిది మళ్ళీ అటుగా వచ్చి, "బుట్టలో ఏమిటి, నాయనా?" అని అడిగింది.

"నారింజపళ్ళు, అవ్వా. రాజకుమార్తెకు వైద్యం చెయ్యటానికి తెచ్చాను," అన్నాడు మూడోవాడు.

"ఇంకేం? రాజకుమార్తెను పెళ్ళాడేస్తా వన్నమాట!" అన్నది ముసలిది.

మూడోవాడు నవ్వి, "నా వంటి పేద వాడికి రాజుగారు తన కూతుర్ని ఇచ్చి చేస్తాడా? ఇంత డబ్బిస్తేచాలు, మా అమ్మ సుఖపడి పోతుంది. ఈ వయసులో ఆవిడ కష్టపడటం చూస్తే నాకు చాలా బాధగా ఉన్నది, అవ్వా," అన్నాడు.

నిలబెట్టుకుని రాజు తన కుమార్తెను ఆ పేద కుర్రవాడి కిస్తాడా, లేదా అని అందరూ రాజు కేసి చూస్తున్నారు.

రాజు మూడోవాడి కేసి ఓరగా చూస్తూ, "నా కూతురిని నీ కిచ్చి పెళ్ళి చెయ్యటానికి అభ్యంతరం ఏమీ లేదు గాని, ముందుగా, నువు నేను చెప్పే పనులు మూడు చెయ్య వలిసి ఉంటుంది," అన్నాడు.

"ఆ మూడు పనులూ ఏమిటో చెప్పండి, సాధ్యమైతే తప్పక చేస్తాను," అన్నాడు మూడోవాడు.

"ముందు ఉద్యానవనంలో ఒక్క పిట్ట కూడా లేకుండా చెయ్యి. పక్షుల మూలాన ఉద్యానం నానా కంగాళీగానూ ఉన్నది," అన్నాడు రాజు. మూడోవాడు ఉద్యానానికి వెళ్ళి కొరడా ఛళ్ళుమనిపించేసరికి పిట్టలన్నీ లేచి దూరంగా వెళ్ళిపోయాయి.

"ఉద్యానంలో ఒక్క పిట్ట కూడా లేకుండా చేశాను. వెళ్ళి చూసుకోండి," అన్నాడు మూడోవాడు.

వాడు చెప్పినది నిజమని రుజువయాక రాజు, "ఆ వనంలోనే కుందేళ్ళు చాలా అల్లరి చేస్తున్నాయి. వాటన్నిటినీ ఒకచోట చేర్చాలి," అన్నాడు.

మూడోవాడు ఉద్యానానికి వెళ్ళి, ముసలిది ఇచ్చిన ఈల ఊదనారంభిం



చాడు. వనంలో ఉన్న మూడువందల కుందేళ్ళు వచ్చి, వాడి చుట్టూ మూగాయి. వాడు ఈల ఊదుతూ రాజభవనానికి బయలుదేరాడు. కుందేళ్ళు వాడి వెంటే గెంతుతూ వెళ్ళాయి.

"మహారాజా, ఉద్యానంలో ఉండే కుందేళ్ళన్నీ ఇవే. వీటిని ఏం చేస్తారో చేసుకోండి," అన్నాడు మూడోవాడు.

రాజు కేమనాలో తెలియలేదు.

"ఈ కుందేళ్ళలో నాకు బాగా నచ్చిన కుందేలేదో తెలుసుకుని నా కివ్వగలవా?" అన్నాడు రాజు.

"అలాగే ఇస్తాను. కాని ముందు రాజకుమార్తె వేలికి ఈ ఉంగరం పెట్టనివ్వండి," అంటూ మూడోవాడు ముసలిది ఇచ్చిన ఉంగరాన్ని పైకి తీశాడు.

"దానికేం భాగ్యం? అలాగే పెట్టు," అన్నాడు రాజు, ఆ బంగారు ఉంగరం సంగతి ఎరగక.

మూడోవాడు ఉంగరాన్ని రాజకుమార్తె వేలికి తొడగగానే అది చిన్నదైపోయి ఆమెకు తీవ్రమైన బాధ కలిగించ నారంభించింది. ఆమె బాధతో చెయ్యి విదిలిస్తూ, "అయ్యయ్యో! నన్నా అబ్బాయికిచ్చి పెళ్ళి చేస్తాననండి!" అని కేకలు పెట్టసాగింది.

"ఇస్తాను! ఇస్తాను! తప్పక నీకూ, అతనికీ పెళ్ళి చేస్తాను," అన్నాడు రాజు కంగారు పడిపోతూ.

వెంటనే ఉంగరం ఆమె వేలి ప్రమాణానికి పెరిగి, చక్కగా అమరింది.

ఆ తరవాత రాజు తన కుమార్తెను మూడోవాడి కిచ్చి పెళ్ళి చెయ్యక తప్పలేదు. రాజుగారి అల్లుడి అన్నలు చెరలో ఉండటం రాజుగారికే అవమానం గనక వాళ్ళు విడిపించబడ్డారు.

మూడోవాడు తన కొక మంచి భవంతిని రాజప్రాసాదంలోనే కట్టించుకుని, తల్లితో సుఖంగా ఉన్నాడు.





# గాజుముక్క

పూర్వం వలభీనగరంలో ఒక గొప్ప రత్న వర్తకుడుండేవాడు. ఆయన సాటిలేని రత్న నిపుణుడు కూడానూ. అందుచేత రాజు గారు కూడా ఆయన సలహా లేనిదే రత్నాలు కొనేవాడు కాడు. నిజాయితీపరుడూ, పెద్ద మనిషీ అని ఆయనకు నగరంలో మంచి పేరుండేది.

ఒకరోజు ఆయన వద్దకు ఒక వ్యక్తి వచ్చి, "అయ్యా, నా పేరు సదాశివుడు. నేను తమతో వ్యాపార సంబంధమై పని ఉండి వచ్చాను. మా వంశంలో అనాదిగా ఒక వెలలేని రత్నం ఉంటూ వస్తున్నది. నేనా ఇప్పుడు పేదవాణ్ణి. అలాటి రత్నాన్ని దగ్గిర ఉంచుకోవటానికి అర్హుణ్ణి కాను. దాన్ని విక్రయించి నా దారిద్ర్యబాధ నివారణ చేసుకో గోరుతున్నాను," అన్నాడు.

ఈ సదాశివుడి నని చెప్పుకునేవాడు వట్టి మాయావి. వాడి మాటలలో కొంచెం కూడా నిజం లేదు. వాడికి ఒకనాడు ఒక గాజుసుద్ద దొరికింది. దాన్ని వాడు ఒక నిపుణుడి చేత సాన పట్టించి, రత్నం లాగా మెరిసేటట్టుగా తయారు చేయించాడు. తెలియని వాళ్ళు దాన్ని చూసి రత్నమే నని భ్రమపడటానికి అవకాశం ఉన్నది.

"ఏదీ, మీరు విక్రయించ దలిచిన ఆ రత్నాన్ని ఒక్కసారి చూడ నివ్వండి," అని రత్నవర్తకుడు అడిగాడు.

సదాశివుడు గుడ్డలపొరల మధ్యనుంచి గాజుముక్కను అతిభక్తితో పైకి తీసి రత్న వర్తకుడికి సమర్పించాడు. రత్నవర్తకుడు దాన్ని కొద్దిసేపు పరీక్షించి, "నిజం చెప్పటానికి నాకు నోరురాకుండా ఉంది. ఇది వెలలేని రత్నం కాదు—పోతగాజు ముక్క!" అన్నాడు.

సదాశివుడు ఆవేశం తెచ్చుకుని, "ఎంత మాట అన్నారు! తరతరాలుగా మా ఇంట

సి. వసుంధరాదేవి

ఉన్న ఈ రత్నం గాజుముక్కా? వలభీలో మీతో సమానుడయిన రత్ననిపుణుడు మరొకరు లేడంటారే? మీరు ఇంత పొరపాటు ఎలా పడ్డారో నాకు అర్థంకాకుండా ఉన్నది," అన్నాడు.

రత్నవర్తకుడు తానిక చెప్పేదేమీ లేదన్నట్టు చెయ్యి ఊపేసి, గాజుముక్కను సదాశివుడి కిచ్చేశాడు.

కాని సదాశివుడు దాన్ని తీసుకోక, "నేను తమర్ని ఈ రత్నాన్ని కొనమని నిర్బంధించను. కొంత కాలం దీన్ని తమ వద్దనే ఉంచి, అవకాశం దొరికితే అమ్మిపెట్టండి," అన్నాడు.

"సరే, మీ యిష్టప్రకారం దీన్ని నా వద్దనే ఉంచుతాను. అమ్మగలనని చెప్పలేనుగాని ప్రయత్నిస్తాను. దీన్ని ఎంతకయితే అమ్ముదా మనుకుంటున్నారు?" అన్నాడు రత్నవర్తకుడు.

"ఎనిమిదివందల వెండిరూకలకు తక్కువైతే అమ్మవద్దు," అని చెప్పి సదాశివుడు శలవు పుచ్చుకున్నాడు.

రత్నవర్తకుడు ఆ గాజుముక్కను ఒక మూల పెట్టేశాడు. సదాశివుడు దాని కోసం తిరిగి వచ్చినప్పుడు ఇచ్చెయ్యటం తప్ప తాను చేయగలిగినది ఏమీ ఉండదని ఆయన అనుకున్నాడు.





ఇది జరిగిన కొద్ది రోజులకే వింధ్యరాజు తరఫున ఒక రాయబారి వలభీనగరానికి వచ్చాడు. రాజుగారి పెద్దభార్య కొరకు రత్నాలు బేరం చెయ్యటానికి ఈ రాయబారి వచ్చినట్టు తెలిసింది. ఆ పెద్దమనిషి రత్న వర్తకుడి వద్దకు వచ్చి, "మా రాణిగారి రత్నాలహారానికి పతకంగా ఉపయోగపడే పెద్ద రత్నం ఏదైనా తమ వద్ద ఉంటే చూపండి," అన్నాడు.

ఇలా రాజదూతలు తన వద్దకు అప్పుడప్పుడూ వచ్చి రత్నాలు కొనుక్కుపోవటం రత్నవర్తకుడికి అలవాటే. అందుచేత ఆయన తన వద్ద ఉన్న విలువైన మేలు జాతి రత్నాలన్నింటినీ వింధ్యరాయబారి ముందు పెట్టాడు.

అయితే వాటిలో ఒక్కటి కూడా ఆ రాయబారికి నచ్చలేదు. అంతేగాక ఆ మనిషి రత్నాలను గురించి ఏ విధమైన పరిజ్ఞానమూ లేనట్టు కనబడ్డాడు. వలభీలో మరెక్కడా దొరకని అపూర్వమైన రత్నాలను అతను తృణీకరించాడు.

అంతలో రత్నవర్తకుడికి సదాశివుడి గాజుముక్క గుర్తుకొచ్చింది. దాన్ని చూసి వింధ్యరాయబారి ఏమంటాడో తెలుసుకోవాలన్న కుతూహలం కొద్దీ ఆయన దాన్ని బయటికి తీసి, "దీన్ని కూడా చూడండి.





రత్నవర్తకుడు దాని విలువ రెట్టింపు చేసి, పదహారువందల వెండిరూకలని రాయబారితో చెప్పాడు.

ఆ ధరకు వింధ్యరాయబారి వెంటనే ఒప్పుకుని, "ఈ రత్నాన్ని నేను పదహారు వందల రూకలకు కొంటాను. ఇప్పుడు నాలుగువందలు బయానా కింద ఇస్తాను. మా ప్రభువువారి అనుమతి పొంది, వారం లోపుగా తిరిగి వచ్చి, మిగతా సొమ్మిచ్చి దీన్ని నేను తీసుకుపోతాను. ఈ లోపుగా దీన్ని మరొకరికి విక్రయించకుండా నా కొక పత్రం రాసి యిప్పించండి," అన్నాడు.

ఇది నా సరుకు కాదు. అమ్మిపెట్టమని ఎవరో ఇచ్చారు. దీని నాణ్యానికి నేను పూచీదారును కాను," అన్నాడు.

వింధ్యరాయబారి దాని కేసి పరీక్షగా చూసి, "ఇలాటిదే నాకు కావలసినది. పెద్దదిగా ఉన్నది. మంచి ధగధగ కూడా ఉన్నది. దీన్ని ఎంతకైతే అమ్ముతారు?" అని అడిగాడు.

సదాశివుడు ఎనిమిదివందల రూకలు అడిగాడు. కాని, అది నిజంగా రత్నమే ననుకుంటున్న ఈ వింధ్యరాయబారి, దాని విలువ ఎనిమిదివందల రూకలే నంటే మరీ తక్కువ అనుకోవచ్చు. అందుచేత

"మీ యిష్టం," అని రత్నవర్తకుడు వింధ్యరాయబారి కోరిన విధంగా విక్రయ పత్రం రాసి ఇచ్చాడు. అందులోని నిబంధన లేమంటే, వింధ్యరాయబారి వారం లోపుగా వచ్చి, మిగతా పన్నెండువందల రూకలూ ఇచ్చి రత్నాన్ని తీసుకుపోకపోతే అత నిచ్చిన బయానాపైకం వదులుకుంటాడు; వారం లోపుగా రత్నవర్తకుడు ఆ రత్నాన్ని మరెవరికైనా విక్రయించినట్టయితే, ఆయన పుచ్చుకున్న బయానాకు రెట్టింపు ఇచ్చుకోవాలి.

ఈ షరతులు రత్నవర్తకుడికి హాస్యాస్పదంగా కనిపించాయి. కాని ఇది జరిగిన

మూడోరోజు కల్లా సదాశివుడు వచ్చి, "నా రత్నాన్ని అమ్మారా?" అని రత్నవర్తకుణ్ణి అడిగాడు.

ఇందులో ఏదో మోసం ఉందని రత్న వర్తకుడు పసికట్టి, ఏం చెప్పాలా అన్న ఆలోచనలో పడ్డాడు.

"ప్రస్తుతం ఈ నగరంలో వింధ్యరాజు దూత ఒకడు రత్నాలు కొంటున్నాడని తెలిసింది. మీరు నా రత్నాన్ని అమ్మి ఉండకపోతే ఇచ్చెయ్యండి. నేను దాన్ని అతనికి చూపిస్తాను," అన్నాడు సదాశివుడు.

రత్నవర్తకుడు ఇరుకున పడ్డాడు. గాజు ముక్కను సదాశివుడికి తిరిగి ఇచ్చేస్తే, వారం లోపుగా ఆ వింధ్యరాయబారి వచ్చి ఎనిమిది వందల రూకలు పరిహారం కింద పుచ్చుకుంటాడు. ఆ గాజు ముక్కకు పదహారు వందల రూకల బేరం తగిలిందంటే అంత మొత్తమూ తన కివ్వమంటాడు సదాశివుడు. అందుచేత రత్నవర్తకుడికి ఏమనిపించిందంటే, ఆ గాజుముక్కను సదాశివు డడిగిన ధరకు తానే కొని, రెట్టింపు ధరకు వింధ్య రాయబారికి అమ్మటం బాగుంటుందనిపించింది.

"మీరు దానికి అడిగిన ఎనిమిదివందల రూకలూ నేను ఇస్తాను, పుచ్చుకోండి," అన్నాడాయన.

సదాశివుడు రత్నవర్తకు డిచ్చిన ఎనిమిది వందల రూకలూ ఎంచుకుంటూ, "అది రత్నమే కాదు, గాజుముక్క అని మీరు అన్నారు కాదూ?" అని యుద్దేవా చేసి వెళ్ళిపోయాడు.

తరవాత వారం గడిచింది. నెల కూడా గడిచింది. వింధ్యరాయబారి రానేలేదు. గాజు ముక్క రత్నవర్తకుడి దగ్గిరే ఉండిపోయింది. ఇంత పేరుపడ్డ రత్నవర్తకుడై ఉండి కూడా ఒక గాజుముక్క కోసం తాను నాలుగువందల రూకలు నష్టపోయినందుకు చాలా బాధపడ్డాడు రత్నవర్తకుడు.





# వదలని ఆశలు

అవంతీ నగరంలో అచ్యుతానందు డనే బీద బ్రాహ్మణ యువకు డుండేవాడు. అతను సకల విద్యలనూ చిన్నతనంలోనే సంపా దించి, గొప్ప మేధావి అనే పేరు తెచ్చు కున్నాడు. నగరంలో గల అనేక బ్రాహ్మణ కుటుంబాలవాళ్ళు అతనికి తమ పిల్లనిచ్చి, అతన్ని తమ ఇంట ఉంచుకుంటామని కూడా అన్నారు.

అయితే అచ్యుతానందుడికి పెళ్ళాడి, సంసారలంపటంలో ఇరుక్కోవటం ఎంత మాత్రమూ ఇష్టంలేదు. అతను నగరం వెలపల అరణ్యప్రాంతంలో ఒక కుటీరంకట్టి నగరంలో భిక్షాటన చేసి తెచ్చినది వండుకు తింటూ, కాలం వెళ్ళ బుచ్చసాగాడు.

అతనికి జీవితం చాలావరకు సుఖంగానే జరుగుతున్నది గాని ఎలుకల బాధ హెచ్చుగా ఉంటూ వచ్చింది. అతను తినగా మిగిలిన ఆహారాన్ని అవి కలుషితం చేస్తూఉండేవి.

ఒక రోజు అతను భిక్షాటనకు గాను నగరంలోకి వెళ్ళినప్పుడు పేరిశాస్త్రి అనే ఆయన ఇంటి ముందు నిలబడ్డాడు. అదే సమయంలో పేరిశాస్త్రి కూతురు కనకవల్లి బిందెతో నీరు తెస్తూ, "ఏమిటి ఇలా వచ్చారు?" అని అడిగింది.

"ఎలుకల బాధ జాస్తిగా ఉన్నది. మీ యింట్లో ఉండే పిల్లిని ఇస్తే కొన్నాళ్ళు ఉంచుకుని తిరిగి ఇచ్చేస్తాను," అన్నాడు అచ్యుతానందుడు.

"దానికేం భాగ్యం? తీసుకువెళ్ళండి," అని కనకవల్లి అతనికి తమ పెంపుడు పిల్లిని తెచ్చి ఇచ్చింది.

అయితే అతను అనుకున్నట్టుగా జరగ లేదు. ఎలుకల బాధ తగ్గకపోగా, కనకవల్లి ఇచ్చిన పిల్లి ఈని, కూనలను పెట్టింది. పిల్లినీ, కూనలనూ పాలు పోసి పోషించటం మరింత పెద్ద సమస్యగా పరిణమించింది.

గోపాలకృష్ణమూర్తి టి. పి.

అతను మరొకసారి పేరిశాస్త్రి యింటికి వెళ్ళాడు. కనకవల్లి కనిపించి, ఎలుకలు పోయాయా అని అడిగింది.

"ఎలుకలు పోలేదు. పిల్లి ఈనింది. పిల్లికీ, కూనలకూ పాలు ఎలాగో తోచటం లేదు. సలహా అడుగుదామని వచ్చాను," అన్నాడు అచ్యుతానందుడు.

"అదేమీ పెద్దసమస్య కాదే? మా పాడి ఆవును తోలుకుపొండి," అన్నది కనకవల్లి. అచ్యుతానందుడు పేరిశాస్త్రిగారి ఆవును తన కుటీరానికి తోలుకుపోయాడు.

కొంతసేపయాక పేరిశాస్త్రి ఇంటికి తిరిగి వచ్చి, కూతురు మీద ఎగిరిపడ్డాడు.

"అతను ఆశలకు దూరంగా వెళ్ళి ఆశ్రమవాసం చెయ్యక పోయినట్టయితే నన్ను అతని కిచ్చి పెళ్ళిచేసి ఉండేవాణ్ణని నువే ఒకప్పుడు అంటివిగదా, నాన్నా? అతను ఆశల ఉచ్చులో తగులుకున్నాడు. ఎలుకల కోసం పిల్లిని అడిగితే చూడి పిల్లినిచ్చాను. పిల్లుల కోసం పాడి ఆవునిచ్చాను. ఆ ఆవు పోషణ అతని వల్ల కాకపోతే నేనే వెళ్ళి చూస్తాను. అతని ఆశలు పెరుగుతాయి గాని తరగవు," అన్నది కనకవల్లి.

కూతురి దూరాలోచనకు పేరిశాస్త్రి నిర్ఘాంతపోయాడు.



కనకవల్లి అనుకున్నంతా అయింది. అచ్యుతానందుడు మళ్ళీ వచ్చి, ఆవుపోషణ తన వల్ల కావటంలేదని మొరపెట్టుకున్నాడు.

"దానికేం భాగ్యం? నేనే వచ్చి చూస్తాను," అని కనకవల్లి అతని వెంట వెళ్ళింది. ఆమె ఆవును మేపటమూ, పాలు తియ్యటమూ మాత్రమే కాక అతనికి వంట చేసి పెట్టింది, కుటీరమంతా శుభ్రం చేసి, దాని కొక ఇంటి కళ తెప్పించింది.

ఒకనాడు పేరిశాస్త్రి వచ్చి, "అమ్మాయికి పెళ్ళి చేద్దామనుకుంటున్నాను. అది వచ్చిన పని అయిపోయింది గద," అని కనకవల్లినీ, ఆవునూ తన ఇంటికి తీసుకుపోయాడు.

అచ్యుతానందుడికి జీవితమంతా ఖోసి పోయినట్టయింది. ఒకప్పుడా కుటీరంలోనే నిశ్చింతగా బతికినవాడికి ఇప్పు డది బావురు మంటున్నట్టయింది. కనకవల్లిని పెళ్ళి చేసు కోకపోతే తన భవిష్యత్తు శూన్యమే నని పించింది అతనికి.

అతను వెంటనే బయలుదేరి పేరిశాస్త్రి ఇంటికి వెళ్ళి, పేరిశాస్త్రితో, "అయ్యా, మీ పిల్లకు పెళ్ళిచేసే ప్రయత్నం చేస్తున్నా మన్నారుగద, ఆమెను నాకే ఇచ్చి చెయ్యండి," అన్నాడు.

"అబ్బాయీ, నువు చూడబోతే ఆశలన్ని టినీ విడిచిపెట్టి అరణ్యవాసం చేస్తున్న వాడివి. చూస్తూ, చూస్తూ నా పిల్లను ఆశ్రమవాసికి ఎలా ఇవ్వను? నువు ఏదైనా జీవనోపాధి కలిగించుకుని నలుగురి మధ్యా నలుగురి లాగే జీవించ దలిస్తే నా పిల్లను నీ కిచ్చి చెయ్యటానికి అభ్యంతర మేమీ లేదు," అన్నాడు పేరిశాస్త్రి.

వెంటనే రాజును చూడటానికి వెళ్ళి అచ్యుతానందుడు తన శాస్త్రప్రావీణ్యాన్ని పరీకించి, తనను కొలువులో ఉంచుకోమని కోరాడు. అతన్ని పండితులు పరీక్ష చేసి, "అబ్బో, ఉద్దండపండితుడు!" అన్నారు.

రాజు తృప్తిపడి అతన్ని తన ఆస్థాన పండితుడుగా నియమించుతూ, గొప్ప కానుకలు ఇచ్చాడు.

అచ్యుతానందుడు వాటిని తెచ్చి పేరి శాస్త్రికి చూపి, కనకవల్లిని పెళ్ళాడాడు. ఆస్థాన విద్వాంసుడు గనక అతనికి మంచి గృహమూ, సేవకులూ కావలసి వచ్చింది. పిల్లలు పుట్టుకొచ్చారు. అతని చుట్టూ కోరికలు పుట్టల లాగా పెరుగుతూ వచ్చాయి. కాని అతను చింతించలేదు. మంచి ఉద్యో గమూ, చక్కదనమూ, వివేకమూ గల భార్యా, పిల్లలూ, మంచి భోజనమూ, పరువు ప్రతిష్ఠలూ మొదలైనవన్నీ అచ్యుతానందుడి జీవితాన్ని సుఖమయమే చేశాయి.





# స్త్రీ నింద

పూర్వం ఒక రాజ్యానికి ఒక యువకుడైన రాజుండేవాడు. అతనికి స్త్రీ జాతి అంటే చాలా గౌరవం. అందుచేత అతను తన సభలో ఎవరైనా ఏ స్త్రీని గురించి గాని అమర్యాదగా మాట్లాడితే సహించేవాడు కాదు.

ఒకనాడు రాజు సపరివారంగా అరణ్య ప్రాంతంలో పర్యటిస్తూ ఉండగా అతనికి ఒక యువకుడు కట్టెలు కొడుతూ కనిపించాడు. అతని భార్య తన భర్త కొట్టిన కట్టెలను పేర్చుతూ సహాయం చేస్తున్నది. ఆ యువక దంపతులను చూస్తే రాజుకు ముచ్చట వేసింది. అతను కొంతదూరంలో ఒక చెట్టు నీడన గుర్రం దిగి కూర్చుని, ఆ కట్టెలుకొట్టేవాణ్ణీ, వాడి భార్యనూ పిలుచుకురమ్మని తన సేవకుణ్ణి పంపాడు.

కట్టెలుకొట్టేవాడు భార్యతో సహా వచ్చి, రాజుకు నమస్కారం చేసి, చేతులు కట్టుకు నిలబడ్డాడు.

"ఏమోయ్, నువ్వు ఎలా జీవనం చేస్తున్నావు?" అని రాజు అడిగాడు.

"చూస్తున్నారు గదా, మహారాజా? నేనూ, నా భార్యా వంట చెరుకు అమ్మి, ఆ వచ్చిన డబ్బుతో జీవిస్తున్నాం," అన్నాడు కట్టెలుకొట్టేవాడు.

"ఆ డబ్బుతో మీకు జరుగుబాటు అవుతుందా?" అని రాజు అడిగాడు.

"కాకేం, మహారాజా? మా కున్న ఖర్చులేమిటి? సంపాదనలో కొంత మిగులుతుంది కూడానూ," అన్నాడు కట్టెలు కొట్టేవాడు.

"మిగిలేది ఏం చేస్తావు?" అని రాజు అడిగాడు.

"మిగిలిన దానిలో కొంత పెట్టుబడి చేస్తాను. కొంత ఋణదాతల కిస్తాను. కొంత పారేస్తాను. ఒక వంతు నా శత్రువు కిస్తాను," అన్నాడు కట్టెలుకొట్టేవాడు.

వి. సురేష్‌కుమార్



ఆ యువకుడు అలా నర్మంగా మాట్లాడటం చూసి రాజుకు చాలా సంతోషం కలిగింది. చదువు సంధ్యలు లేని పాటకపు జనం అలా మాట్లాడతారని రాజుకు తెలును. ఆ యువకుడి మాటలకు గూఢార్థమేమిటో తెలుసుకోవాలని రాజుకు అనిపించింది. అందుచేత అతనా యువకుణ్ణి తన వెంట దూరంగా, చెట్ల మధ్యకు తీసుకుపోయి, "నువ్విప్పుడన్న మాటలకు అర్థమేమిటో నాకు రహస్యంగా చెప్పు," అన్నాడు.

"మహారాజా, నేను దానధర్మాల కింద ఖర్చు చేసేది పెట్టుబడి అన్నాను; ఎందుకంటే, అది ముందు జన్మకు లాభిస్తుంది. నేను రుణదాతలన్నది నా తల్లి దండ్రులు; వాళ్ళు నన్ను పెంచి, పెద్ద చేసి, శక్తిమంతుడుగా తయారు చేశారు. నేను తాగుడు కిందా, వినోదాల కిందా ఖర్చు చేసేది అవతల పారేసిన డబ్బే గద. ఇక మిగిలినది నా శత్రువు కిస్తానన్న డబ్బు. నా శత్రువంటే మరెవరో కాదు, నా భార్య," అన్నాడు కట్టెలుకొట్టేవాడు.

మొదటి మూడు అంశాలూ విని సంతోషించిన రాజు, నాలుగో విషయం విని కోపం తెచ్చుకుని, "చూడు, కుర్రాడా? నీ భార్య నీ శత్రువన్నావే, అది చాలా పొరపాటు మాట. ఆడవాళ్ళ పట్ల మనం ఎంతో మర్యాదగా ఉండాలి. అందుచేత, ఇకెన్నడూ నీ భార్యను శత్రువుగా భావించకు," అని మందలించాడు.

కట్టెలుకొట్టేవాడు తల వంచుకుని, జవాబు చెప్పకుండా ఉండిపోయాడు.

తిరిగి రాజే అతనితో, "నీ మాటలలోని గూఢార్థాలు ఇంకెవరితోనూ చెప్పకు. మన రాజ్యంలో వాటికి అర్థం చెప్పగల వాళ్ళు ఎవరైనా ఉన్నారేమో తెలుసుకోవాలనుంది. అందుచేత నువు ఈ రహస్యాన్ని ఎవరికైనా చెప్పావో నీకు యావజ్జీవ కారాగృహవాస శిక్ష విధిస్తాను," అన్నాడు.

కట్టెలుకొట్టేవాడు అందుకు సమ్మతించాడు.

తరవాత రాజు తన నగరానికి వెళ్లిపోయి, కట్టెలుకొట్టేవాడు తనతో అన్న మాటలను చాటింపు వేయించి, వాటికి అర్థం చెప్పగల మనిషికి పుచ్చకాయంత బంగారం ఇస్తానని ప్రకటించాడు.

ఆ మాటలకు అర్థం చెప్పి, బహుమానం పుచ్చుకుందామని చాలామంది ప్రయత్నించారు, కాని ఒక్కరూ సరిఅయిన అర్థం చెప్పలేకపోయారు.

చాటింపు మాత్రం అన్ని మూలలా రోజూ జరుగుతూనే ఉన్నది.

ఒకనాడు కట్టెలుకొట్టేవాడి భార్య ఆ చాటింపు విని, ఆ మాటలు తన భర్త రాజుతో అన్నవేనని గుర్తించింది. వాటికి అర్థమేమిటో తన మొగుణ్ణే అడిగి కనుక్కొని వెళ్లి, రాజుతో చెబితే పుచ్చకాయంత బంగారం దొరుకుతుంది. అటువంటి అవకాశం మళ్లీ వెయ్యి జన్మలెత్తినా రాదు.

అందుకని ఆ సాయంకాలం తన భర్త ఇంటికి రాగానే ఆమె, "ఆ రోజు నువ్వు రాజుగారితో అన్నావే ఆ మాటలకు అర్థమేమిటి?" అని అడిగింది.

"వాటి అర్థంతో నీకేం పని?" అని కట్టెలుకొట్టేవాడు భార్యను అడిగాడు.





భార్య అలిగి పడుకోవటం కట్టెలుకొట్టే వాడికి ఏమీ బాగాలేదు. ఆమె అలక తీర్చ టానికి అతను ఎన్నో విధాలయత్నించాడు.

"నీ మాటలకు అర్థ మేమిటంటే చెప్పక పోతివిగా? నే నెట్లా చస్తే నీకేం? నా మీద నీకు మొదలు ప్రేమ ఉంటేగా?" అన్న దామె కోపంగా.

"ప్రేమ ఉన్నందుకు బతికినన్నాళ్ళూ రాజుగారి కారాగృహంలో మగ్గి, చావ మంటావా?" అని భర్త అడిగాడు.

"నువు నాకు చెప్పావని రాజుగారికి ఎలా తెలుస్తుందేమిటి?" అన్నది భార్య.

"నిన్ను నా వెంట ఉండగా రాజుగారు చూశారుగద?" అన్నాడు భర్త.

"ఆయనకు నేను గుర్తుండబోయానా? ఆయన అసలు నా కేసి చూడనేలేదు," అన్నది భార్య.

"సరే నేను నీకు మాటల అర్థం చెప్పా నన్న మాట బయటపడకుండా చూసే భారం నీదే," అంటూ కట్టెలుకొట్టేవాడు తన మాటల అర్థం తన భార్యకు చెప్పేసి, ఆమె ముఖం ఆనందంతో వికసించటం చూసి పరమానందం చెందాడు.

"వాటికి అర్థం చెబితే రాజుగారు పుచ్చ కాయంత బంగారం ఇస్తారట. నేను చెప్పి, రాజుగారిచ్చే ఆ బంగారం తెచ్చుకుంటాను," అన్నది భార్య.

"అది బాగానే ఉన్నది. కాని నేనా మాటలకు అర్థం ఏమిటో ఎవరికన్నా చెబితే యావజ్జీవం నన్ను కారాగృహంలో పెట్టిస్తానని రాజుగారు అన్నారు. అది కూడా గుర్తుంచుకో," అన్నాడు భర్త.

తనకు అంత బంగారమే దొరికితే భర్త గతి ఏమైతే నేమని కట్టెలుకొట్టేవాడి భార్యకు అనిపించింది. అందువల్ల ఆమె మొగుడి మీద అలిగి, ఏడుస్తూ పడుకున్నది.

మర్నాడు కట్టెలుకొట్టేవాడి భార్య రాజు గారి వద్దకు వెళ్ళి, మాటలకు అర్థం చెప్పి,

పుచ్చుకాయంత బంగారం బహుమానం పొందింది.

రాజు ఆమె కేసి పరీక్షగా చూసి, "నిన్ను వెనక ఎక్కడో చూసినట్టుందే?" అన్నాడు.

"అవును మహారాజా. నేనూ నా పెనిమిటీ అడవిలో కట్టెలు కొట్టుకుంటూండగా తమరు అటు కేసి వచ్చి, మాతో మాట్లాడారు," అన్నదామె.

రాజు నిర్ఘాంతపోయి, "ఆ కట్టెలుకొట్టే వాడి భార్యవా? వాడే నీకు ఈ మాటలకు అర్థాలు చెప్పలేదుగద?" అన్నాడు.

"అవును, మహారాజా!" అన్నదామె.

రాజుకు పట్టరాని ఆగ్రహం వచ్చింది. అయినా, కట్టెలుకొట్టేవాడి భార్యను బహుమానం పుచ్చుకోనిచ్చాడు. ఎందుకంటే బహుమానం పొందటానికి, అర్థం చెప్పటం తప్ప యితర నిబంధనలేవీ లేవు.

ఆమె వెళ్ళిపోయాక రాజు కట్టెలుకొట్టే వాణ్ణి పిలిపించి, "రాజాజ్ఞ ఉల్లంఘించి నువ్వు నీ మాటల అర్థాన్ని నీ భార్య కెందుకు చెప్పావు? నీకు యావజ్జీవ కారాగృహ శిక్ష తప్పదు," అన్నాడు.

"విధించండి, మహారాజా. చెప్పిన దాకా నన్ను పీడించుకు తిన్నది. దాని పోరు పడలేక చెప్పాను. నాకు యావజ్జీవశిక్ష విధిస్తారని చెప్పినా అది లక్ష్యపెట్టక వచ్చి బహుమానం పుచ్చుకున్నది. నా భార్య నాకు శత్రువని అన్నందుకు మీరు నన్ను అనాడు మందలించారు. ఇప్పుడైనా నా మాటలో నిజం ఉన్నట్టు తమరికి తోచవచ్చు," అన్నాడు కట్టెలుకొట్టేవాడు.

రాజుకు ఒక్కసారిగా కళ్ళు తెరుచుకున్నట్టయింది. ఆయన కట్టెలుకొట్టేవాడి తెలివితేటలనూ, సూక్ష్మబుద్ధినీ మెచ్చుకుని, అతని భార్య కిచ్చినదాని కన్న చాలా హెచ్చు బహుమానా లిచ్చి పంపేశాడు.

అటుతరవాత ఎవరన్నా స్త్రీలను నిందిస్తే రాజు అంతగా పట్టించుకోవటం మానేశాడు.





# అమరఫలం

పూర్వం ఒక ముని సర్వసంగపరిత్యాగి అయి అరణ్యంలో తపస్సు చేసుకుంటూ ఉండగా, ఒకనాడు ఒక దేవత ప్రత్యక్షమై, మునికి ఒక ఫలాన్ని ఇచ్చి, "నీ తపస్సుకు మెచ్చాను. ఈ అమరఫలాన్ని చేతిలో ఉంచుకుని నువు ఏది కోరుకున్నా సిద్ధి స్తుంది," అని చెప్పి అంతర్ధానమయింది.

మునికి కోరిక ఏదీ లేదు. అయితే దేవత తనకు ఒక పరీక్ష కింద ఈ ఫలాన్ని ఇచ్చి ఉంటుందని ఆయన భావించాడు. దాన్ని ప్రజలకు ఉపకరించే విధంగా ఒక ఏర్పాటు చేయ నిశ్చయించి, ఆయన ఆ ఫలాన్ని తీసుకుని రాజు వద్దకు వెళ్ళాడు. రాజు మునికి తగిన మర్యాదలు చేసి, ఆయన వచ్చిన పని అడిగాడు.

"రాజా, ఇదొక అమరఫలం. దీన్ని వెల యిచ్చి కొన్నవారికి ఒక్క కోరిక సిద్ధిస్తుంది. ఆ తరవాత దాన్ని ఇతరులకు తక్కువ వెలకు విక్రయించాలి. కోరిక తీరిన అనంతరం ఈ ఫలాన్ని ఎవరూ ఒక వారంరోజుల కన్న ఎక్కువకాలం దగ్గిర ఉంచుకోరాదు. ఉంచుకోవటం చాలా అపాయం. దీన్ని ముందుగా నీ కిస్తున్నాను. దీని కెంత వెల ఇస్తావో చెప్పు," అని ముని అన్నాడు.

రాజుకు అగత్యంగా తీరవలసిన కోరిక ఒకటి ఉన్నది. ఆయనకూ, పొరుగురాజుకూ చాలాకాలంగా యుద్ధం సాగుతూ ఉన్నది. నిష్కర్షగా ఎవరికీ విజయం చేకూరటం లేదు. బోలెడంత నష్టం మాత్రం అవుతున్నది. అందుచేత రాజు ఈ అమరఫలం ద్వారా పొరుగురాజు పై విజయం సాధించాలనుకుని, ఆ పండును లక్షవరహాలకు కొన నిశ్చయించాడు.

ముని ఆ పండును రాజు కిస్తూ, "నీ కోరిక తీరిన వారం రోజుల లోపల, కొన్న ధర కంటె తక్కువ ధరకు దీన్ని ఎవరి

ఆర్. నారాయణరావు

క్కైనా అమ్మాలి. నీ నుంచి కొనేవాడికి కూడా ఈ మాట చెప్పాలి," అని లక్ష వరహాలూ రాజు నుంచి పుచ్చుకుని, వాటిని పేదసాదలకు దానం చేసేసి, తన దారిన తాను అరణ్యానికి తిరిగి వెళ్ళి, తపస్సు చేసుకోసాగాడు.

అమరఫలం వల్ల రాజుకు త్వరలోనే కోరిక సిద్ధించింది. మళ్ళీ యుద్ధం వచ్చినప్పుడు పొరుగురాజు చిత్తుగా ఓడిపోయాడు. ఆ రాజ్యం కూడా ఈ రాజుదే అయింది.

విజయం లభించిననాడే రాజు నిండు కొలువులో అమరఫలాన్ని అందరికీ చూపి, దాని మహిమ గురించి చెప్పి, కావలిసిన వారికి దాన్ని విక్రయిస్తా నన్నాడు. దీర్ఘ వ్యాధితో బాధపడుతున్న సామంతు డొకడు దాన్ని తొంభైవేల వరహాలిచ్చి కొని, తన వ్యాధి నివారణ చేసుకున్నాడు.

వెంటనే అమరఫలం చేతులు మారింది. దాని ప్రభావంతో అనేకమందికి అనేక రకాల కోరికలు తీరాయి. కొందరికి వాణిజ్యం కలిసివచ్చింది, కొందరు విద్యావంతు లయారు, అనేకమంది వ్యాధుల నుంచి విముక్తులయారు. కోరికలు తీర్చుతున్నకొద్దీ అమరఫలం విలువ కూడా తగ్గుతూ వచ్చింది.



చాలాకాలం గడిచింది. పుష్యార్కు డనే వాడికి పక్షపాతం వచ్చింది. అతను ఒకప్పుడు అమరఫలాన్ని కొని తన భార్యను మృత్యుముఖం నుంచి తప్పించాడు. ఆ అమరఫలం ఇప్పు డెంత వెలలో ఉన్నదని విచారించగా రెండుకాసులని తెలిసింది. రెండు కాసు లిచ్చి దాన్ని కొంటే తన వ్యాధి నయమయాక దాన్ని మరొకరికి ఒకకాసుకే అమ్మాలి. ఇక ఆ మనిషి దాన్ని ఇంకెవరికీ విక్రయించలేక ప్రమాదంలో పడతాడు. ఇలా అనుకుని పుష్యార్కుడు అమరఫలాన్ని కొనక, వైద్యుణ్ణే నమ్ముకుందామనుకున్నాడు.

కాని అతని భార్య మాలిని తన భర్తకు తెలియకుండా రెండుకాసు లిచ్చి, తమ నౌకరు ద్వారా ఆ ఫలాన్ని తెప్పించి, తన భర్త వ్యాధి నయం కావాలని కోరుకున్నది. పుష్యార్కుడి వ్యాధి తీసేసినట్టు నయమయింది. తాను తీసుకున్న మందులే పని చేశాయనుకున్నా డతను.

ఇప్పుడు మాలిని అమరఫలాన్ని ఎవరికన్నా ఒకకాసుకు అమ్మాలి. కాని ఎవరికని అమ్మటం? అమ్మితే కొన్నవాళ్ళ గతేమిటి? అమ్మకుండా తన దగ్గిరే ఉంచుకుని ఏ అపాయం వచ్చినా భరించటానికే ఆమె నిశ్చయించుకున్నది. తనకు ప్రమాదం ఏ రూపంలో వస్తుందో నన్న బెదురుతో మాలిని రోగిష్ఠిదాని లాగా అయిపోసాగింది.

నౌకరు ఒకనాడు, "ఏమండీ, అమ్మగారూ? వంట్లో బాగా లేదా?" అని అడిగాడు.

"ఇక నేను ఎంతోకాలం బతకనురా!" అని మాలిని అమరఫలం గురించి చెప్పింది.

"ఎందుకండీ అమ్మగారూ, మీరు చావటం?" అన్నాడు నౌకరు.

"దాన్ని ఎవరికి అమ్మనురా? ఎవరు కొన్నా ఇదే చిక్కులో పడతారు. చూస్తూ చూస్తూ ఇంకొకర్ని చంపటం దేనికి? నేనే చస్తాను," అన్నది మాలిని.

నౌకరు నవ్వి, "ఎవరూ చావొద్దు! ఒక కాసుకు ఆ అమరఫలాన్ని నాకు అమ్మెయ్యండి," అన్నాడు.

"ఇంకానయం! నీ కోరిక తీరినాక దాన్ని ఇతరులకు ఎలా అమ్ముతావు?" అన్నది మాలిని.

"నే నసలు కోరిక కోరితేగద! దాన్ని పెట్టెలో దాస్తాను," అంటూ నౌకరు ఒక కాసు తీసి మాలిని కిచ్చి, అమరఫలాన్ని తీసుకుపోయి, తన ఇంట్లో కొయ్యపెట్టె అడుగున దాచాడు. అటుతరవాత అది ఏమైనదీ తెలీదు. కొంతకాల మయాక చూస్తే దాని జాడ కనిపించలేదు.





# కృష్ణావతారం

ఉష చూపులు అనిరుద్ధుడి పటం మీద లగ్నమైపోవటమూ, ఆమెకు కలిగిన గగుర్పాటూ గమనించి చిత్రరేఖ చిరునవ్వు నవ్వుతూ, "నీకు కలలో కనిపించినవాడెవడో తెలిసిపోయిందిలే. అతను ఎక్కడ, ఏస్థితిలో ఉన్నాసరే, నేను వెళ్ళి అతన్ని తీసుకువచ్చి నీకు అప్పగిస్తాను. ఆ తరవాత నీయిష్టం," అన్నది.

ఉష చిత్రరేఖను చూసి, "నీ నేర్పు ఎలాటిదోగాని, నువు రచించిన ఈ చిత్తరువు చూస్తూంటే, కలలో ఇతన్ని చూసినప్పుడు కలిగిన భావాలన్నీ మళ్ళీ కలిగాయి. ఇతనిది ఏ వంశం? పేరేమిటి? ఎలాటివాడు? ఏం చేస్తూఉంటాడు? దయవుంచి కాస్త చెబుదూ!" అన్నది.

దానికి చిత్రరేఖ, "ద్వారకా నగరాన్ని ఏలే కృష్ణుణ్ణి గురించి నువు వినే ఉంటావు. శివుడి కంటిమంటకు ఆహుతి అయిన మన్మథుడే కృష్ణుడికి ప్రద్యుమ్ను డనే కొడుకుగా పుట్టాడని చెబుతారు. ఇతను ఆ ప్రద్యుమ్నుడి కొడుకు. పేరు అనిరుద్ధుడు. అతని శౌర్యం జగత్ప్రసిద్ధమయినది. అటువంటి వాణ్ణి భర్తగా పొందగలిగితే నీ అదృష్టాన్ని పొగడటం ఆదిశేషుడికి కూడా సాధ్యంకాదు. మన ఈ శోణపురం లాగే ద్వారకానగరం కూడా పరులకు చొరరానిది. అయినప్పటికీ, నీకు సంతోషం కలగగలందులకు, నేను ఏదో ఒక ఉపాయం చేసి అక్కడికి పోతాను. నీ ప్రియుణ్ణి తప్పక తీసుకువస్తాను," అన్నది.

25. ఉషా అనిరుద్ధుల వివాహం



"నీకు ఉపాయాలకు లోటా? యోగ విద్య ఎరిగినదానివి; కామరూపమూ, కామ గమనమూ కలదానివి; ఎలాటి పని అయినా సాధించగలవు. ఈ అనిరుద్ధుడి ముఖం నా కళ్ళపడితేనే గాని బతకను. నా ప్రాణాలు కాపాడు. ఇప్పటికే ఏడు రోజులు ఓర్చుకున్నాను. ఇక ఒక్క ఘడియకూడా ప్రాణాలు నిలపలేను," అని ఉష అన్నది.

చిత్రరేఖ ఉషను కౌగలించుకుని, "నువు వెళ్ళి మిగిలిన చెలికత్తెలతో కాలక్షేపం చేస్తూ ఉండు," అని ఆమెను పంపేసి, తాను ఆకాశంలోకి ఎగిరి అంతర్ధానమయింది. అలా అంతర్ధానమైన చిత్రరేఖ మనోవేగంతో ఒక్క క్షణంలో ద్వారక చేరి, తరవాత ఏం చెయ్యాలా అని చూస్తూండగా, ఒక కొలను దగ్గిర నారదుడు కనిపించాడు. చిత్రరేఖ ఆయనను సమీపించి, నమస్కరించింది.

నారదుడు చిత్రరేఖను దీవించి నవ్వుతూ, "ఏమిటి ఇలా వచ్చావు?" అని అడిగాడు.

చిత్రరేఖ ఆయనకు, పార్వతీదేవి ఉషకు చెప్పిన మాటలూ, ఆ ప్రకారమే ఉషకు కలలో అనిరుద్ధుడు కనిపించటమూ, తాను అనిరుద్ధుణ్ణి తీసుకుపోయి ఉష వద్ద చేర్చటానికి రావటమూ చెప్పి, "అనిరుద్ధుణ్ణి నేను తీసుకుపోతే బాణుడు ఎలాగూ ఆగ్రహించి, అతనిపై తన ప్రతాపమంతా చూపుతాడు. అందుచేత మీరు కృష్ణుడికి ఈ విషయం కాస్త చెప్పటం అవసరం. బాణుడికీ, కృష్ణుడికీ యుద్ధం జరిగితే ఎలాగూ కృష్ణుడు గెలుస్తాడు. ఆ విషయం నాకు భయంలేదు. నాకు ప్రస్తుతం భయమల్లా, నేను తన మనమణ్ణి తీసుకుపోయానని తెలిసి, కృష్ణుడు నన్ను శపిస్తాడేమో నని. మీరు దయచేసి నాకు కృష్ణుడి భయం లేకుండా చేస్తే మా ఉషాకన్య కోరిక ఈడేరుతుంది," అన్నది.

నారదుడు చిత్రరేఖకు తామసి అనే విద్య ఉపదేశించి, " ఈ విద్యద్వారా నీపని సానుకూలం అవుతుంది. నువు అనిరుద్ధుణ్ణి తీసుకుపోయిన కారణంగా బాణుడితో యుద్ధం జరిగినప్పుడు నే నక్కడికి వచ్చి యుద్ధం నిలుపుచేస్తాను," అని తనదారిన తాను వెళ్ళిపోయాడు.

చిత్రరేఖ అదృశ్యరూపంలో కృష్ణుడి భవనాన్నీ, ప్రద్యుమ్నుడి భవనాన్నీ దాటి, అనిరుద్ధుడి మందిరం చేరి, బంగారు లోటాలతో మధువు తాగుతూ అనేకమంది స్త్రీల మధ్య కూర్చుని ఉన్న అనిరుద్ధుణ్ణి చూసింది. అతన్ని రంజింపజెయ్యటానికి సౌందర్యవతులైన స్త్రీలు ఆడుతున్నారు, పాడుతున్నారు. కాని చిత్రరేఖ అతని కేసి పరీక్షగా చూసి, అతని మనసు అన్యాయత్తంగా ఉండటం గమనించింది. అతను నవ్వితే అది తెచ్చిపెట్టుకున్న నవ్వులాగున్నది, మాట్లాడితే గొంతు గద్గదంగా విని పిస్తున్నది. అతని ఏ చేష్టలోనూ పూనిక అన్నది లేదు.

" కొంపతీసి ఇతను కూడా ఉష లాగే కలగనలేదు కద! ఇతని మనసును చెదరగొట్టగల అందం ఉషకు కాక మరెవతెలో ఉంటుంది? పార్వతీదేవి అనుగ్రహం వల్ల ఏదైనా సాధ్యమే," అనుకున్నది చిత్రరేఖ.





నతమత మవుతున్నది. నే నామె చెలి కత్తెను, చిత్రరేఖ అనేదాన్ని. నీకు సమ్మత మయిన పక్షంలో నా వెంట నిన్ను తీసుకు పోవచ్చాను. మీ రిద్దరూ ఒకరి కోసం ఒకరు పుట్టారు, సందేహంలేదు. ఇదంతా దైవ ఘటన. ఇలా జరుగుతుందని పార్వతీదేవి ముందే చెప్పింది. నేను నీ పటం తయారు చేసి చూపి, ఆశరేకెత్తించకపోతే మా ఉష ఏమైఉండేదో! అనేక మంది భార్యలు గల నీ దారి వేరు. నీ కోసమే అలమటిస్తున్న మా ఉషను కాపాడు. నేను నీకు నమస్కారం చేసి వేడుకుంటున్నాను."

ఈ మాటలు విని అనిరుద్ధుడు, "ఏం చెప్పేది? మీ చెలి కన్న కలే నాకూ వచ్చింది. అది మొదలు నాకు ఏది రాత్రో, ఏది పగలో తెలియటంలేదు. నిద్ర అనేది ఎరగను. నాపాలిటి దేవతలాగా నువు రాక పోతే నాకు ఏం చెయ్యాలో కూడా తెలియదు. నన్ను నువు వేడుకోనవసరంలేదు. ఉష దగ్గిరికి నన్ను నువు తీసుకుపో, నేను వస్తాను," అన్నాడు.

ఈ మాటకు చిత్రరేఖ చాలా సంతోషించింది. ఆమె అతని చెయ్యి పట్టుకుని ఆకాశంలోకి లేచి, తనతోపాటు అనిరుద్ధుణ్ణి కూడా అదృశ్యమయేటట్టు చేసింది. మరు

ఆమెకు అతనితో మాట్లాడాలనిపించింది. నారదుడు తనకు ప్రసాదించిన విద్యద్వారా ఆమె అక్కడ ఉన్న మిగతావాళ్ళందరినీ మూర్ఛపుచ్చి, అనిరుద్ధుణ్ణి సమీపించి, అతని ఎదట ప్రత్యక్షమై, చేతులు జోడించి, ఇలా అన్నది:

"బలిమహారాజు కొడుకు బాణుడు. ఆయనకు పార్వతీదేవి అనుగ్రహంవల్ల ఒక కుమార్తె కలిగింది. ఆమె పేరు ఉష. ఆమె త్రిలోకైక సుందరి. ఆమె చక్కదనాన్ని బ్రహ్మ కూడా వర్ణించలేడు, నావల్ల ఏమవుతుంది? ఉషాకన్య ఒక రాత్రి నిద్రలో నిన్ను చూసి, అప్పటినుంచీ విరహబాధతో



రుద్ధుడు ఉష చేతిని తన చేతిలోకి తీసుకుని పాణిగ్రహణం చేశాడు.

కొన్నాళ్ళు ఉషా అనిరుద్ధులు దాంపత్య సుఖం అనుభవిస్తూ గడిపిన మీదట, వారి రహస్యం అంతఃపురపు కావలివారికి తెలిసింది. వాళ్ళు వెళ్ళి బాణుడితో చెప్పారు. ఎవరో ఒక మానవమాత్రుడు, తన ఖ్యాతినీ, పరాక్రమాన్నీ లక్ష్యపెట్ట కుండా, తన యింట ప్రవేశించి, తన వంశానికి మణిపూసలాటి తన కుమార్తెను కళంక పరిచాడనేసరికి బాణుడికి ఆగ్రహం వచ్చింది.

"మీరు వెంటనే వెళ్ళి ఆ దుర్మార్గుణ్ణి పోనీక, చుట్టుముట్టి పట్టుకోండి. నాకు పరాభవంచేసి దేవతలు కూడా ప్రాణాలతో తప్పించుకోలేరు," అని బాణుడు తన భటులను హెచ్చరించాడు. వెంటనే కొన్ని వేలమంది రాక్షస కింకరులు కత్తులూ, బాణాలూ పట్టుకుని ఉష అంతఃపురం మీద పడ్డారు.

ఆ కలకలం విని అనిరుద్ధుడు మేడ పైభాగం నుంచి, భవనాన్ని చుట్టుముట్టి కేకలుపెట్టుతున్న రాక్షసభటులను చూసి, ఒక్క క్షణంలో పోరాటానికి సిద్ధమయే సింహంలాగా అయిపోయాడు.

క్షణంలో వాళ్ళిద్దరూ శోణపురంలోని ఉష మందిరంలో ఉన్నారు.

ఉషా అనిరుద్ధులు ఒకరి నొకరు ప్రత్యక్షంగా చూసుకున్నారు. ఇద్దరూ ఆనంద పారవశ్యం చెందారు.

"ఇదుగోనమ్మా, నీ ప్రియుడు. నామాట చెల్లించుకున్నాను. ఇతనికి నీ చెయ్యి ఇచ్చి పాణిగ్రహణం చెయ్యి. గాంధర్వ వివాహం రాజులకు తగినది. దీనికి పార్వతీదేవి కటాక్షం కూడా తోడయింది. ఇక మీరు భార్యాభర్తలు," అంటూ చిత్రరేఖ ఉషను కౌగలించుకుని, ఇద్దరికీ కొత్తబట్టలూ, పూల దండలూ, ఆభరణాలూ ఇచ్చింది. అని



ఈ లోపల ఉష కన్నీరు కార్చుతూ, చేతులు నలుపుకుంటూ, "కన్యలు చేయ కూడనిపని చేశాను. కులనాశకురాలినీ, కులటనూ అయాను. మూడు లోకాలనూ ఏలే తండ్రికి శత్రువునయాను. వెలలేని మాణిక్యంలాటి రాజకుమారుడికి చిక్కు తెచ్చిపెట్టాను. జగదంబ ఇచ్చిన వరం కూడా వృథా పోయేటట్టున్నది. నేనేం చేసేది? అదృష్టదేవతలారా, ఈ అపద తప్పించలేరా?" అంటూ ఆక్రోశించింది.

అమెను చూసి అనిరుద్ధుడు చిరునవ్వు నవ్వుతూ, "పిచ్చిదానా, నా పరాక్రమం నీకు తెలీదు. మీ తండ్రి బలగం మాట చెప్పకు, ఫాలాక్షుడు ప్రమథగణాలతో వచ్చినా గెలవగలను. నా శత్రువులను నా పిడికిళ్ళతో పొడిచి, నవరంధ్రాలా నెత్తురు కక్కించి, ఈ నగరానికి శోణపురం అనే పేరు సార్థకమయేటట్టు చేస్తాను, కిటికీ దగ్గిర నిలబడి చూస్తూ ఉండు. భయపడ వలసిన పనిలేదు," అన్నాడు.

ఇలా అంటూనే అతను అంతఃపుర ద్వారం వద్ద ఉన్న పరిఘ ఒకటి తీసుకుని, రాక్షసుల పైకి వెళ్ళాడు. ఈ సమయంలో నారదుడు వచ్చి, ఆకాశాన నిలబడి వినోదం చూడసాగాడు.



రాక్షసులు అనిరుద్ధుడి మీద బాణాలూ, గదలూ, తమ వద్ద ఉండే సమస్త ఆయుధాలూ ప్రయోగించారు. కాని అతను వాళ్ళను లక్ష్యపెట్టక, తన చేతనున్న పరిఘతో రాక్షసులను ఎడాపెడా చదమ సాగాడు; చేతికి అందిన వాళ్ళను పిడికిలితో పొడిచాడు. రాక్షసులలో కొందరు చచ్చారు. కొందరు గాయపడ్డారు. మిగిలినవాళ్ళు పారిపోయి బాణుడి ఎదట నిలబడ్డారు. బాణుడు వాళ్ళను చూసి కోపంతో నానా మాటలూ అన్నాడు:

"శత్రువుకు విజయం ధారపోసి, ప్రాణాలమీది తీపితో పారిపోయి వచ్చారా?



శౌర్యపరాక్రమాలు పారిపోయి రావటానికా? ఒకప్పుడు మీ మీద అధారపడి లోకాలు జయిస్తినే! నా కెంత అవమానం తెచ్చి పెట్టారు! పదండి, మీ వెనకనే రథగజ తురగపదాతులనూ, యోధులనూ పంపుతున్నాను. శత్రువు హతమారితీరాలి," అంటూ బాణుడు కాలకేయులనే రాక్షసులను అనిరుద్ధుడి పైకి పంపాడు. వాళ్ళు భూమ్యాకాశాలు ఆక్రమించి అతడి పైకి యుద్ధానికి వచ్చారు.

రాక్షసులు తన మీదికి యుద్ధానికి వస్తూ ఉండటం గమనించి అనిరుద్ధుడు ఒక కత్తీ, డాలూ తీసుకుని రాక్షసుల పైకి వెళ్ళి, తన కత్తితో శత్రుబలాలను ఊచకోత కొయ్యనారంభించాడు. తాను ఒంటరి అయి ఉండి కూడా, అనేక వేల సంఖ్యగల రాక్షసులతో తలపడి అనిరుద్ధుడు మెరుపులాగా యుద్ధం చేస్తుంటే నారదుడికి ఆ యుద్ధం అద్భుతంగా కనిపించింది. ఆయన ఎందరో మేటి వీరులు పోరాడుతూండగా చూశాడు. అనిరుద్ధుడిలాగా శత్రువులకు దిగ్భ్రమ కలిగించేలాగా యుద్ధం చేసినవాడు ఒక్కడూ లేడు.

బాణుడు పంపిన రాక్షసులు కొందరు చచ్చారు, కంగారులో ఒకరి నొకరు తొక్కుతున్నారు, కొందరు పారిపోసాగారు. అనిరుద్ధుడు పెడబొబ్బలుపెడుతూ వాళ్ళను తరిమికొట్టాడు.

అనిరుద్ధుడి చేత చావుదెబ్బలు తిని పారిపోయి వచ్చిన తన యోధులను చూసేసరికి బాణుడికి ఏదో సంకోచంలాటిది బయలుదేరింది. తన చేతి దెబ్బతిని, ప్రాణాలతో విడిచిపెట్టబడిన ఇంద్రాదులు ఇప్పటికీ తన పేరు చెబితే వణికిపోతారు. అటువంటిది ఒక అనామకుడు తన బలాలను ఎదిరించి జయించాడు! అది చూసి బాణుడు తానే అనిరుద్ధుడితో యుద్ధం చెయ్యటానికి బయలుదేరాడు.





# అరణ్యపురాణం

## 28

కొవా శరీరం మళ్ళీ లావెక్కటమూ, అతను చైతన్యంతో బుస కొట్టటమూ మౌగ్లీకి తెలియ వచ్చింది.

"గడిచిన ఋతువులన్నీ తిరిగి చూశాను. హిస్! నది కేసి పోదాం పద. కుక్కల తండా గురించి ఏం చెయ్యాలో నేను నీకు చూపుతాను," అన్నాడు కావా.

అతను బాణంలాగా సూటిగా వాయిన్‌గంగ పెద్ద పాయకేసి బయలుదేరాడు. మౌగ్లీ అతని వెంబడే బయలుదేరాడు. అడుగున "శాంతిశిల" గల మడుగులోకి అతను ప్రవేశించినప్పుడు మౌగ్లీ తాను కూడా ఈదసాగాడు.

"ఈదకు, తమ్ముడూ. నేను చాలా వేగంగా పోతాను. నా వీపు పట్టుకో," అన్నాడు కావా. మౌగ్లీ తన ఎడమ చేతిని కావా మెడ చూట్టూ వేసి, కుడి చేతిని తన శరీరానికి అంటి ఉంచి, కాళ్ళు సూటిగా పెట్టుకున్నాడు. అప్పుడు కావా ప్రవాహానికి ఎదురీదుతూ వెళ్ళాడు.

శాంతిశిలకు ఒకటి, రెండు మైళ్ళు ఎగువన వాయిన్‌గంగ చలవరాతి గుట్టల మధ్యగల సన్నని కనుమకుండా, అతి వేగంగా ప్రవహిస్తుంది. తాము కనుమ కుండా పోయేటప్పుడు మౌగ్లీ ఈ పక్కా, ఆ పక్కా చూశాడు. గాలిలో అతనికి తియ్యా తియ్యని, పుల్ల పుల్లని వాసన వచ్చింది. అతను చప్పున తన తలను నీటి అడుగుకు ముంచి గాలికోసం మాత్రమే అప్పుడప్పుడూ పైకెత్తుతూ వచ్చాడు.

నీటి అడుగున ఉన్న ఒక రాతికి తోక మెలిక వేసి కావా ఆగాడు.

"ఇది మృత్యు గహ్వరం! ఇక్కడి కెందు కొచ్చాం?" అన్నాడు మౌగ్లీ.

అట్ట చివరి బొమ్మ



"సరిగా చూడు. అంతా నిద్రపోతున్నారు. నేను నీ చెయ్యంత వాడినప్పుడు కూడా ఈ ప్రదేశం ఇలాగే ఉండేది. ఏమీ మార్పు లేదు," అన్నాడు కావా.

అరణ్యం పుట్టిన నాటినుంచీ ఈ కనుమ లోని రాళ్ళ గుట్టలలో కొండ తేనెటీగల నివాసాలు ఏర్పాటై ఉన్నాయి. అందుచేత ఈ ప్రాంతానికి అరమైలు దూరంలోకి ఏ ప్రాణీ రాదు. ఆ సంగతి మౌగ్లీ ఎరుగును. కనుమలోని ప్రతి గహ్వరంలోనూ తేనె పట్లున్నాయి. కనుమ పొడుగునా రెండు పక్కలా నల్లటి మఖ్మల్ పరదాలు వేళ్ళాడ గట్టినట్టుగా కనబడుతుంది. కొన్ని కోట్ల తేనెటీగలు నిద్రపోతున్నాయి. వాటిని చూసే మౌగ్లీ తన తలను నీటిలో ముంచాడు.



కావా మళ్ళీ కదిలి, ప్రవాహానికి ఎదురు ఈదుతూ కనుమ అవతలి చివరకు చేరుకుని, "ఇదే ఈ రుతువులో వేట భూమి, చూడు!" అన్నాడు.

నది ఒడ్డున మూడు అస్తిపంజరాలు కనిపించాయి. రెండు జింక పిల్లలవీ, ఒకటి అడవి దున్నదీనూ. ఆ మూడు జంతువులూ దారి తప్పి వచ్చి, తేనెటీగల బారి పడ్డాయి.

"వాళ్ళు నిద్ర లేచేలోగా మనం వెళ్ళిపోదాం," అన్నాడు మౌగ్లీ.

"వాళ్ళు తెల్లవారితేగాని లేవరు. నేను చెప్పేది విను. చాలా చాలా ఏళ్ళ క్రితం ఒక దుప్పి, కుక్కలు తరుముతూంటే, దక్షిణం నుంచి ఇటుకేసి వచ్చింది. దానికి అరణ్యం తెలీదు. అది భయంతో గుడ్డిదై పోయి ఈ కనుమలోకి దూకింది. కుక్కలూ దూకారు. మిట్ట మధ్యాన్నంవేళ ఈగలు మంచి రోషంమీద ఉన్నారు. దూకిన కుక్కలు నీటిని చేరే లోపలే చచ్చారు. దూకని కుక్కలూ చచ్చారు. కాని దుప్పి బతికింది!" అన్నాడు కావా.

"దుప్పి ఎలా బతికింది?" అని మౌగ్లీ ఆశ్చర్యంగా అడిగాడు.





"ప్రాణభయం కొద్దీ ముందు దూకినది దుప్పి. అది దూకినాకగాని ఈగలకు చైతన్యం కలగ లేదు. ఆ తరవాత దూకిన కుక్కల పని ఖాళీ అయిపోయింది," అన్నాడు కావా.

"దుప్పి చావనే లేదా?" అన్నాడు మౌగ్లీ ఆలోచిస్తూ.

"ఈగల మూలంగా చావ లేదు. కాని అది ప్రవాహంలో పడిపోతుంటే బలంగా పట్టుకునేటందుకెవరూ లేరు—ఏ మౌగ్లీ గాని అలా దూకితే కావా అనే స్థూలకాయు డుండేటట్టుగా!" అన్నాడు కావా.

"మృత్యువుతో చెలగాటమే! కాని—కావా, అరణ్యంలో నీ అంత జ్ఞాని మరొకడు లేడు," అన్నాడు మౌగ్లీ.

"కుక్కల మంద నిన్ను తరిమిందే అనుకో. పైన ఉండగానే చావని కుక్కలు ఇక్కడో, ఇంకా దిగువనో నీటిలో పడతారు. వాయిన్‌గంగ ప్రవాహం మహా దారుణ మైనది. పాపం, వాళ్ళను పట్టుకునేందుకు కావా ఉండడు. వాళ్ళు సియోనీ గుహల దగ్గిర తేలుతారు. అక్కడ వాళ్ళ పీకలు కొరకటానికి మంద సిద్ధంగా ఉంటుంది," అన్నాడు కావా.

"అద్భుతం, అద్భుతం! రాత్రి సూర్యుడు పొడిచినా ఇంతకన్న మంచి ఏర్పాటుండబోదు. పోతే, పరిగెత్తటమూ, దూకటమూ మాట చూడాలి. నన్ను కుక్కలు చూసి, వెంటపడేటట్టుచెయ్యాలి," అన్నాడు మౌగ్లీ.

"ఎగువన ఉన్న రాళ్ళగుట్టలను అవతలి పక్కనుంచి చూశావా?" అన్నాడు కావా.

"లేదు, లేదు. ఆ మాట మరిచాను," అన్నాడు మౌగ్లీ.

"వెళ్ళి చూడు. చాలా ఘోరమైన ప్రదేశం. అంతటా నెర్రెలూ, గుంటలూనూ. పొరపాటున కాలు పడరానిచోట పడిందో, వేట అక్కడే ముగుస్తుంది. నిన్నిక్కడే వదిలేసి, కుక్కలతండా కోసం ఎక్కడ

చూడాలో మందకు చెబుతాను. ఆ పైన ఇది నాకు సంబంధించిన సంగతి కాదు. నా జాతివేరు, తోడేళ్ళ జాతివేరు," అంటూ కావా ప్రవాహం వెంబడి ఈదుకుంటూ వెళ్ళాడు. ఒక చోట అతనికి ఫావో, అకేలాలు కనిపించారు.

"స్! కుక్కలు! కుక్కల తండా ప్రవాహం వెంట వస్తుంది. మీకు ధైర్యం ఉంటే, వాళ్ళను లోతు తక్కువ నీటిలో చంపవచ్చు," అన్నాడు కావా.

"వాళ్ళెప్పు డొస్తారు? మనిషి కూన ఎక్కడ?" అని అకేలా అడిగాడు.

"వాళ్ళు వచ్చినప్పుడు వస్తారు, ఇక మీ మనిషికూన మాటా? అతని వద్ద మాట తీసుకుని మృత్యువుకు ఎరవేశారుగా? అతను నా వెంటే ఉన్నాడు. అతనిసరికే చావకపోతే అది నీ తప్పుకాదు, పండు కుక్కా! తండా కోసం ఇక్కడే వేచి ఉండండి. నేనూ, మీ మనిషికూనా మీపక్షాన ఉన్నందుకు సంతోషించండి," అంటూ కావా ప్రవాహానికి ఎదురీది వెళ్ళి కనుమ మధ్య నిలిచి ఎగువనున్న కొండల అంచును పరికించసాగాడు.

త్వరలోనే నక్షత్రాలకు అడ్డంగా మౌగ్లీ తల కదలటం కనిపించింది. తరవాత మనిషి నీటిలో దూకిన చప్పుడయింది. మరు క్షణం మౌగ్లీ కావా చుట్టలమధ్య చేరాడు.

"అదొక పెద్ద దూకు కాదు. నేను సరదాకు అంతకంటె కెట్టింపు దూకాను. అయితే పైన ఉన్న ప్రదేశం చాలా చండాల మైనది. పొట్టిపొట్టి పొదలూ, లోతైన గుంట లూనూ. ఒక చోట మూడురాళ్ళు ఒకదాని మీద ఒకటి పేర్చి పెట్టాను. పరిగెత్తేటప్పుడు వాటిని కాళ్ళతో తోసేస్తాను. ఈగలకు చచ్చే కోపం వస్తుంది. నేను మళ్ళీ వచ్చేదాకా ఇక్కడే ఉండు, కావా. వేకువన తండాను రెచ్చగొడతాను," అంటూ మౌగ్లీ కనుమ చివర ఒడ్డుకు ఈదుకుంటూ వెళ్ళాడు.



# 82. ప్రాచీన మెసొపొటామియా అవశేషాలు

ఈనాటి మోసల్ (ఇరాక్) నగరానికి 15 మైళ్ళు ఈశాన్యాన "పెద్ద దిబ్బ", 75 అడుగుల ఎత్తు గలది, ఉండేది. దాని కింద 3,000 సంవత్సరాల నాగరికతల అవశేషాలు 26 పొరలలో బయట పడ్డాయి. (బొమ్మలో కనిపించేది 16 వ పొర. దాని కింద ఇంకా 10 పొరలున్నాయి.)

అలెగ్జాండరు మరణానంతరం మెసొపొటామియా అంతరించింది. కాని దాని నాగరికత అనేక ప్రాంతాలకు విస్తరించి, వివిధ రూపాలలో ఈనాటికి నిలిచి ఉన్నది. మెసొపొటామియా ప్రపంచంలో 5 వేల ఏళ్ళు నిలబడింది. అందులో సగం కాలంపాటు అది నాగరికతను అభివృద్ధి చేసుకున్నది. లిపివి సృష్టించటమూ, గణిత, నక్షత్ర శాస్త్రాలూ, ధర్మశాస్త్రమూ మొదలైనవి అనేకం సృష్టి అయాయి.



Photo by A. L. Syed



బహుమతి
పొందిన వ్యాఖ్య

నీటికోసం యోచన

పంపినవారు:
టి. ఆర్. ఆంజనేయులు, చిలకలూరిపేట

Photo by B. Bhansali



బహుమతి పొందిన వ్యాఖ్య

వర్షం వచ్చే సూచన

పంపినవారు:
టి. ఆర్. అంజనేయులు, చిలకలూరిపేట

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1968 నవంబర్ నెల సంచికలో ప్రకటించబడును





★ పై ఫోటోలకు సరి ఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ సెప్టెంబర్ నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## సెప్టెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: నీటికోసం యోచన

రెండవ ఫోటో: వర్షం వచ్చే సూచన

పంపినవారు: త్రిపురం రామాంజనేయులు,

చిలకలూరిపేట. (గుంటూరు జిల్లా)

బహుమతి మొత్తం రు. 10/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

**Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'**

వస్తూంది!

నవభారత్ ఫిలిమ్సు

# అగ్గిమీద గుగ్గిలం

దర్శకత్వం: జి. విశ్వనాథం

ఆంధ్ర పూర్వా
సీడెడ్ జయలక్ష్మి పిక్చర్స్
నైజాం విజయా డిస్ట్రిబ్యూటర్స్
మైసూరు సుధా చిత్ర



రచన పింగళి
సంగీతం సత్యం
నిర్మాత P.S. ప్రకాశరావు
నిర్వహణ: A. పూర్ణచంద్రరావు

# 'ఇప్పుడు సీత ఉత్సాహంతో ఉబ్బిపోయే ఇల్లాలు!'



కాని, కొన్నాళ్లకు ముందు సీతకు నీరసము, నెత్తి మీద కోపము. చివరికి ఆమె ఒక డాక్టర్ని సంప్రదించింది.

డాక్టరు ఇలా అన్నారు: "రోజంతా చురుకుగా వుండుటకు కావలసినంత పోషణ మీకు లభించ లేదు. హార్లిక్స్ త్రాగండి."





ఇప్పుడు సీత ఎంత మారిపోయిందో చూడండి! హార్లిక్స్ ఆమెను ఉత్సాహంతో ఉబ్బిపోయే నూతన వ్యక్తిగా చేసింది!

## హార్లిక్స్ సీతకు ఒక క్రొత్త జీవితం ప్రదానము చేసింది!

హార్లిక్స్‌లోని సారవంతమైన పరిపోషకత్వము క్రొత్త బలాన్నీ మరియు శక్తినీ కలిగించి అలసటతో కూడిన నీరసాన్ని పోగొడుతుంది. ప్రపంచమంతటా గల డాక్టర్లు హార్లిక్స్‌ను సిఫార్సు చేస్తారు. గోధుమ పిండి మరియు మాల్టెడ్ బార్లీల పోషకవంతమైన సారములు మరియు పూర్తి మీగడ గల పాలతో హార్లిక్స్ చేయబడినది. శక్తిని కలిగించుటకు హార్లిక్స్ దివ్యమైనది.




# హార్లిక్స్ అదనపు శక్తిని కలిగించును!

# దిలీప్ అతడి స్నేహితులు

చేపలువస్తే అద్భుతకథ

(2)

చేపలవేటకు వెళ్లి తిరిగి వస్తున్న దిలీప్ బృందం. రైల్వే పట్టాలదగ్గర ఫిష్‌ప్లేట్లు లేకపోవటం గమనించారు. రైలువస్తే, యీ విషయం హెచ్చరించటం ఎలా?

నేను ఉపాయం చెబుతాను! బొరేయ్ సురేష్ నువ్వు తొడుక్కున ఎర్రచొక్కా ఇలా ఇయ్యి.

ఎందుకు ఏంచేస్తావు కుస్తీ పడతావా.

దానికంతా టైములేదు, ఇప్పుడు! ఇదుగో ఆ గాలపు కర్ర ఇయ్యి!

సరేగాని దాన్ని ఎలానిలబెడతావు మరి

ఎర్రజండా తయారుచేస్తున్నాను.

ఏదైనా రైలుబండివస్తే ఆపదలేకుండా ఆగిపోతుంది.

భూమిని త్రవ్వుదాంరా

కాని డ్రైవరుకు ఏలాతెలుస్తుంది అది ఎర్ర సిగ్నల్ అని.

కంగారుపడకు- ఎవరెడి ఆ పనినిచేసేస్తుంది. నేను బ్యాటరీని వేస్తాను జండామీదికి అది ఎర్రగా కనిపిస్తుంది.

ఇంక కొంచెంవుంది చూదాం ఏం జరుగుతుందో

వచ్చేవారము: రైలు వస్తోంది. అది సిగ్నల్ చూస్తుందా!

అతి తెల్లనైనకాంతి, అతి స్థిరమైన శక్తి అది ముప్పూటికీ 'ఎవరెడి'

UC-4348

# సర్వదా సర్వోత్తమం




★ అసమాన సౌరభ్యంలో
★ అనుపమ రుచిలో
★ కరకరలాడే తాజాదనంలో
★ సాటిలేని పుష్టికరంలో సర్వదా సర్వోత్తమం-

## పార్లే గ్లూకో

బిస్కట్లు




అందుకే పార్లే గ్లూకో భారత దేశంలో
అత్యధికంగా అమ్మకమగుచున్న బిస్కట్ !

everest-340ar-PP TL.

